చ॥ అతఁడు మదీయపుత్రుఁడు మహామహిమాస్పదుఁడే నొసంగు, నా
నతినిఁ దిరస్కరింపఁడిది నాకునుసమ్మతి, నీకు నిద్ది స
మ్మతియగునేనిఁ జెల్పుమన, మాయురె! యచ్చెరువంచు భీష్ముఁడా
సతిని నుతించి మోదమతి సమ్మతి నాకిదియంచుఁబల్కెనన్ ౮౮

ఉ॥ యోజనగంధి తల్చెనది. యోగివరుండును భాస్కరోపమ
భ్రాజితకాంతికాయుఁడును భాసిలు దండకమండలంబుఁగృ
ష్ణాజినముల్ ధరించి యపు డాసతి వద్దకు వచ్చి పాదపం
కేజములంటి మ్రొక్కిడఁ గేలను బుత్రునిఁ గౌఁగలించుచున్ ౮౯

క॥ జనని పయస్సును స్తనములఁ
గనులను నతివేలముగను గార్చుచు సుతునిన్
మనమారఁగఁ గనులారఁగఁ
గనుచును ముదజలధిమునుఁగఁ గని ముని యనియెన్ ౯౦

మ॥ జనయిత్రీ! భవదీయకాంక్షితము నే సర్వంబు నూహించితిన్
జనునే నీదగు నాజ్ఞమీఱ? నెది నీసంతోష మౌ కార్య మే
నునుఁ జేయంగలవాఁడ నీవ్విపలు నన్నున్ బొంకుచున్ జిత్తమం
దు నసహ్యంబు వికారరూపమనుచున్ దూషించినన్ జేటగున్ ౯౧

ఆ॥ వె॥ అనుచు మౌని వరుఁడు వినువ శశాంకవం
శాంకురోద్భవేచ్ఛ నతివ పూని
బహునిదర్శనములు బాగొప్పఁ దెలుపుచు
వధువు లనుమతించు విధము జెప్పె. ౯౨

తే॥ గీ॥ అవనిపతి సతు లాకరాత్రి యందుఁబూత
చిత్తలగుచును శయనంబుఁ జేరి; మున్నె
చంద్రు రాకకు వేచు విశాఖలటుల
వేచియుండిరి మునిఁగోరి వేడ్క మీఱ. ౯౩

ఆ॥ వె॥ జిగి జటాకలాప మృగచర్మ వల్కల
ధారియై వికారతనువుఁగలిగి
వచ్చినట్టి మౌనివరుని నంబిక చూడ
రోసి నయనయుగము మూసికొనియె. ౯౪.

ఆ॥ వె॥ అట్టు నిమీలనేత్ర యగు నంబికనుగూడి
మరలి జననిఁజూచి మందలించె
హస్తిబలుఁడు పుట్టు నగు నంధుఁడీభువిఁ
దల్లితప్పుఁజేసి తనయుఁడనిన. ౯౫.

చం॥ మునివరువాక్యముల్వినుచు మోదమునందనితల్లి; పుత్రుఁ గ
గని తనయా! నినుంగలయఁగాచిన యన్యవధూరతిన్, వనం
బునకుఁ బ్రమోదమిచ్చు సుతు, భూవలయంబును గెల్చువాని, ని
మ్మనిన మునీంద్రుఁడాసతి గృహమ్మున జేరెను, మీఱుదారిమిన్ ౯౬.

తే॥ గీ॥ ఆలయాగతమునిని నంబాలికయును
జూడఁగనె లజ్జ యానతిఁగూడె; మౌని
యింతికిని దౌహృదత్వము నీకమున్నె
తన్వికాంచె విపాండురత్వమును భీతి. ౯౭.

క॥ ఆ సతినిఁగూడి మరలుచు
వ్యాసుఁడు జనయిత్రికనియె బలశాలి సుతుం
డీసతికిఁ గలుగు నైనను
నాసతిదోషమునఁ బాండురాంగుం డయెడిన్. ౯౮.

క॥ అని చనె ముని. కనె ధృతరా
ష్ట్రుని నంబిక, గ్రుడ్డివానిఁజూచి వనిత యో
జనగంధి వనటఁగుందుచు
మునివరునిన్ మరలఁదలఁచె, ముని వేంచేసెన్. ౯౯

చం॥ తనయునిఁ జూచి సత్యవతి తక్షణమాహ్వయుఁ బోలఁగాంచి సత్యావో
మునిసలదీప యంధుఁ డటుపుట్టెను జూడఁగ నోపఁగాన నీ
వును మఱి నావధూరతిఁ బుత్రుని నాకొసఁగి స్తోత్రపాత్రునిన్
గను మన పేలటంచుఁ జనెఁ గాంతగృహంబునకున్ ముదాప్తిగన్ ౧౦౦

సీ॥ మునివరు వైరూప్యమును జూడ భీతిలి యంబిక తనదాదినంపె సదియు
నైపుణిమీఱంగ నైపథ్యవతియగుచు, మందయానంబున మౌనిఁ జేరి
ప్రతిబద్ధరాగయై ప్రతిలేని మంజుల గానంబు సలిపిన మౌనివరుఁడు
మృగము గీతమునకు మెచ్చి నిల్చినరీతి హర్షించి వశుఁడయి యవ్వ రతిని

తే॥ గీ॥ సంతసంబంది జనయిత్రిసరసకుఁజని
నీదు స్నుష దాసి వచ్చెను నాదుకడకు
గాన యమిశాపవశుఁడగు కాలుఁడిలను
విదురనామముచే నుద్భవించు ననుచు. ౧౦౧

చ॥ పలికి మునీంద్రుఁడీగతి నపత్యపుఁగృత్యము మాటిమాటికిన్
సలుపఁగఁ దన్నుఁ గోరుటది చాలని మిక్కిలి వేఁడి తాఁ జనెన్
వెలనెను దాసి పుత్రుని పవిత్రుని జన్మముచేత, సత్క్రియల్
వెలసినరీతి సత్ఫలము వేగ మెయిచ్చుచుఁ జేయువారికిన్ ౧౦౨.

తే॥ గీ॥ కురుకులంబునకును వృద్ధికరులు సుతులు
ముగ్వురును భీష్మపోషణమునను బెఱిఁగి
క్రమముగా సర్వకళలను గఱచి దర్ప
కోష్మల దశావిశిష్టులై యొప్పిరెలమి. ౧౦౩.

ఉ॥ షోడశదాననిర్మలయశోనిధి పాండు నృపాలుఁడంచుఁ దా
నీడితతత్కళాంశముల నిండు నిబింబము ధాత చేయుచో
జూడక తన్మృగాజినముఁ జొన్పఁగ శంకము మండలంబునన్
గీడమెుఁగాని చంద్రుఁడు జనించెను వారిధినన్న నవ్వరే! ౧౦౪.

క॥ ధృతరాష్ట్రునకుఁ భీష్ముఁడు
క్షితికిఁ బట్టంబుఁగట్టి సేనాపతిగన్
ధృతిగల పాండుమహీశుని,
మతిమంతుని విదురు ముని చె మంత్రిపదవికిన్. ౧౨౪.

క॥ నయమున మంత్రియు, మిక్కిలి
భయమున సేనాధిపతియుఁ బలికి ధనమునన్
జయలక్ష్మియు నొనఁగూర్పఁగ
దయతో ధరణీధవుండు ధరఁ బాలించెన్. ౧౦౫.

సీ॥ ఆపగాసూనుఁడా యాంబికేయునకును,
బరిణయంబొనరించు పనినిఁబూని
గాంధారపతిసుత కలదనివిని మాతనంపె నాకన్యక నడుగ నంత
నాతఁడాత్మజ నియ్య ననుమతించుచు సుత
కీయుదంతముఁదెల్పె, నింతిపతిని
నంధునిగ నెఱింగి యాయరుంధతియుంచు,
చెలువమై పరపురుషులను గంటు
తే॥ గీ॥ నైనఁజూడఁగ నోడుచు నక్షియుగము
వసనమునఁగట్టి కురురాజవాసగృహముఁ
జేరి సురనది సాగరు చేత నాద
రింపఁబడుకేతి సతి యాదరింపఁబడియె. ౧౨౬.

సీ॥ యాదవపతి శూరుఁడను వానిసుత పృథ
కుంతిభోజుని కూర్మికూఁతురుగను
బోషింపఁబడుచుఁ దపోవనంబుననుండి
ఘనతపోధనుఁడు క్రోధనుఁడు మౌని
వరుఁడు దూర్వాసుఁడు వచ్చిన నతనికిఁ
బరిచర్యకై తండ్రిపంపుఁబూని

కంతుకఖేలనం బంతయు విడనాడి,
విహగలాలనముల విడిచి సఖుల
తే॥ గీ॥ సరససల్లాపముల నెల్ల సరకుగొనక
యమివరుని పూజసల్పుచు ననవరతము
నతనియానతిమీఱక యటులయిటుల
పోయి తనపని మఱవక పొలతియొప్పె. ౧౦౮.

క॥ ఆరామవల్లరీతతి
గారామము చేతఁ గాంచు కన్నియ నిరతం
బారాజమాని భ్రూలతి
కారాజినిఁ గాచుచుండెఁ గాఁ గడుభక్తిన్ ౧౦౯.

క॥ స్తనపత్ర వల్లరీ లే
ఖనకర్మ శ్రమ చెందకుండు కన్యామణి యా
మునివరు దుష్కరశాసన
మనుక్షణమున సల్పనొప్పె ముదమెనలారన్ ౧౧౦.

క॥ ఇటులొక వత్సరముండిన
జటికిన్ బరిచర్యఁజేయ సంయమివరుఁడా
కుటిలాలక మదిమెచ్చుచు
పటుతర మంత్రంబొకండు వరముగనిచ్చెన్. ౧౧౧.

ఉ॥ ఇచ్చి తదీయమంత్రమున నింతిరో! దేవగణంబునందు నీ
మెచ్చినవానినిన్ బిలువ మీఱక యాపురుషుండు సత్వరన్
వచ్చి స్వతుల్యుఁడౌ సుతుని వాసిగ నొకఁని నీకునిచ్చు నో
సచ్చరితా: యిఁకన్ దపముజల్పఁగఁ బోయెదనంచుఁబోయినన్ ౧౧౨.

క॥ మునిమంత్ర మహిమఁగన మన
మున వేడుకపుట్టి యరుదయమున మేనముఁదాఁ

జని పాటలారుణుని(గని
వినయంబున(వేడి పిలిచె విధుముఖి యంత. ౧౧౩.

సీ॥ పచ్చనివస్త్రంబు( బటుతరకవచకుం
డలకిరీటములును వెలయుభానుఁ
జలివేణి సరసను నిలిచి కరంబుల(,
బచ్చి నిజబలెఁ బృథ(బట్టె నంత
భామిని భయమంది భాస్కర! నేబాల,
జనకు నానతి లేక చనదు నాకు
నేమియుఁజేయంగ నీధర్మ మీవెఱుం,
గనిదె? నన్నవ్వద్దులుము కరుణఁబూని
తే గీ॥ యనిన నతివను భయకంపితాంగిఁగన్గుచు
నరుణుఁడరుణాననుండయి యనెను, భామ!
యాదరింపక భాయను నీదుకడకు
వచ్చినాడను సంభోగ వాంఛఁజేసి ౧౧౪.

సీ॥ ఇంతి నాయభిమత మీవొనర్పకయున్న
నీమంత్రదాత నేనిపుడె శాప
సర్పవేష్టితుని(గా( జల్పుదు నావాంఛి
తము నెరవేర్చిన నిమిషముననె
అదితి నన్నసినట్టు లధిక తేజోవంతు
సుతు(గాంచెదవీవును సుదృశ! నీకుఁ
గన్యకాభావంబుఁ గలుగును మత్ప్రభా
వంబున ననిపలెఁ; వనితశిరము
తే॥గీ॥ వంచె, లజ్జాస్మితంబులు వారిజాక్షి
సమ్మతినిఁదెల్ప నరుణుండు భాయనుబలెఁ
గాంత నెద(జేర్చి శరదభ్ర కాంతిఁబోలు
శయనమందున నిడి యుంచె సంతసంబు ౧౧౫.

కం॥ అరుణుని తేజము నణచుచుఁ
దరుణీమణి వహ్నిశిఖనుఁ దలఁపించెడి భా
స్వర కాంతినందె, నాసతి
హరుసంబునఁ బల్కరించి యరుణుఁడు జనియెన్ ౧౧౬.

సీ॥ వసధిచింతామణి బలె సురనాథుని
యభిమతం బొనఁగూర్చి యధిక తేజుఁ
గనియె నృపాత్మజ; కనినంత నపవాద
శంకితయయి యాప్తసఖులతోడ
నురగంబుఁ బేటికనుంచిన భంగిఁగుం
డలకంచుకోజ్జ్వలు లలితుఁదనయుఁ
బేటికయందిడి విడిపించె దానిని
వెల్లిలో, సింగపుఁబిల్ల నిడిన

తే॥ గీ॥ పంజరంబునుఁబోలి ప్రవాహభంగ
డోలికాశతలాలితఁబోలెఁ బేటి
మెల్ల మెల్లన నిటులటు మెదలుచుఁ జని
చేరె నధిరథు పురనదీతీరభూమి ౧౧౭.

చం॥ తనసతి రాధఁగూడి దరిఁదన్వియుఁ బొందుచు సూతుఁడచ్చటన్
గనియెను బేటికన్; దెఱచి కన్నుల పండువుగాఁగ నుండు వా
నిని నవసౌహృతున్ గనుచు నిండు ముదంబున బాలు నక్కునం
గొనుచు భార్యకున్ ముదము బెంపెనఁబారఁగనిచ్చె బ్రీతితోన్ ౧౧౮.

కం॥ పాలించె రాధ కావున
బాలుఁడు రాధేయుఁడనఁగఁ బరఁగుచు భృగురా
మాలయమునుఁ జేరి సన్నుత
మేలగు విలువిద్య గురులు మెచ్చఁగ నేర్చెన్ ౧౧౯.

క॥ తరుణీస్వయంవరమ్మున
కరుదెంచిన నృపులఁగనక యా పాండునిఁదా
వరియించెఁగుంతి యభ్రము
వరయక్ సురగజముదక్కఁ నన్యముఁగనునే ౧౨౦

తే॥ గీ॥ ఆకృతినిఁగన్న జయలక్ష్మి యనఁగనొప్పు
మాద్రియను మానినీమణి మద్రరాజ
సుతను సుదృశను నాపగాసుతుఁడు దెచ్చి
పరిణయ మొనర్చె ముదమునఁ బాండునకును ౧౨౧

క॥ మృగయా వినోదపరుఁడై
మృగనేత్రలఁగూడి పాండునృపతి చని వనిన్
మృగ నాగ మృగేంద్రాళిని
తెగటార్పఁగ వెనుకసాఁగె ధీరవరుండై ౧౨౨

చ॥ మృగనయనాసహిష్ణుతసుమించి మృగాన్వయమెల్ల వారిఁగ
ల్వఁగఁగుమికూడి పైఁబడఁగవచ్చినరీతి నెదుర్కొనంగ, నా
శుగములవానిఁ జంపెను వసుంధరనేత, నిజాన్వయేశు కుం
దుగ నివియుండఁ బోలదని తోఁచె మనంబున నాక్ రయంబునన్ ౧౨౩

మ॥ హయహేషారవ మాలకించి, ఘనకోపాటోప భూదారసం
చయమెల్లన్ వడి హుమ్మటంచుఁ దను వేశంతమ్ముల స్వీడిరా,
రయమార న్వసుధేశుఁడాశుగతతిన్ రాజిల్లఁగాఁ ద్రుంచె నా
రయ భూదార పదేర్ష్యతన్ గనలి వైరంబూనెనో యంచనన్ ౧౨౪

చ॥ సముదవిశృంఖలాప్తి మహిషంబులు శృంగవిదీర్ఘికంబులన్
గుమికొని చుట్టి రాఁగనుచుఁగూల్చెను భూపతి వానినెల్ల వే
గమునఁ గులాధినేతయగు కాలునివాహనముండు నాడు న
క్రమముగ వానిఁజేర్చుటది సత్క్రియయంచుఁ దలంచెనోయనన్ ౧౨౫

తే॥ గీ॥ చాపరావము తరుణపంచాననాళి
వినుచుఁగనలుచు గుహలను వెడలిరాగ
బంచతను నొందె మోమొకటంచు రాజు
పంచతను గూర్చెఁదను వెల్ల బాణవితతి ౧౭౬.

క॥ మృగరక్త బిందువులచే
దగఁగొల్పు నిదాఘబిందు ధారలచే నా
వ్వాగనొందు పొందు నలసట
నగరాజ సమీరణాప్తి నణఁగెను మిగులన్ ౧౭౭.

సీ॥ అచ్చట నటవిని నంగజాకేళిని,
హరిణద్వయం బురుహర్షముననను
విహరించుచుండ భూవిభుఁడు బాణము వేయ,
నొకమృగ మఱచుచు నుక్కుఁదకిఁ
యవనిపైఁబడుచు గోపారుణేక్షణముల
నగ్నికణంబుల నపరిమితము
గను గ్రక్కుచును బాండుఁగని నేను గిందముఁ
డను ద్విజుండను గామహతుఁడనైతి

తే॥ గీ॥ మున్ను, నేనిప్పుడీ శరమ్మునకుఁజిక్కి
హతుఁడనైతిని, నీవు నీ యతివఁగూడి
నపుడ యమపురిఁ గందువటంచుఁజచ్చె
నతనితోడనె యతివయు నగ్నిఁజొచ్చె. ౧౭౮.

క॥ దానింగని నిర్విణ్ణుం
డై నృపతి విరక్తిఁ బూని యబలాసక్తిన్
బోనడచి సతులతోఁదప
మూనఁదపోవనముఁ జేరె సుచిత్తజ్ఞుండై. ౧౭౯.

క॥ భూషణవస్త్రాదులతో
వైషయిక సుఖంబువదలి వల్కలము జటల్
భూషలుగాఁగొని రాగ
ద్వేషాదులుమాని యానెఁదిరమగుతపముల్ ౧౩౦.

మ॥ కరికుంభాహతికేళిలంపటయుతుల్ గాంతాకుచద్వంద్వముల్
బరిపీడించెడిలంపటుల్ మఱి యరిప్రాణానిలంబాను ని
ష్ఠురబాణోత్కరలంపటుల్ దవులుచున్ శోభిల్లుహస్తంబులా
గిరియందుండు కుశాంకరంబుల నయో! గిల్లంగ నర్హంబయెన్ ౧౩౧.

ఆ॥ వె॥ అల్లెత్రాడు దివిచి హస్తికుంభముఁజీల్చి
యంగుళంబు లటుల హస్తతలముఁ
గర్కశత్వమొందెఁ గావున సమిధలు
జీల్చునపుడు బాధఁజెందవయ్యె ౧౩౨.

ఉ॥ కాననమందునుండు మృగకాండము మైత్రినిఁ బెంపుచున్ సదా
మానసశత్రువర్గమును ప్రమందఁగఁజేయుచు ధీరుఁడై మహా
జ్ఞానులవాక్యముల్వినుచుఁ గాంచెను భూపతి తాపసార్హమా
శ్రీనిఁ దపోవనంబునను జేకుఱెరాజ్యము నెల్ల భంగులన్ ౧౩౩.

సీ॥ రాజర్షి యొకనాడు రమణిఁగుంతినిఁగని,
వ్యాసమహాముని వరమువలన
నాయన్నభార్య గాంధారి పుత్రశతంబుఁ
గను గర్భమునుదాల్చె ననఁగ వింటి
ననిపల్కె, యోయింతి! ఘనతమోపహమైన
పుత్రనామం బెట్టి పుణ్యమిచ్చు
నట్టిపుణ్యమును నే నార్జింపనైతిని,
యన్యగాముచేత నేమరుపుత్ర

తే. గీ॥ మేల యనపత్య యనిచ్చు మేలు సుకసుఁ
జనని తోడ పయి శయనించి చన్గుఁ డ్రావు
బాలు మోమునఁ బ్రసుద బాష్పములు సుఁజియు
తండ్రి యాప్యుని నిజగుణ తాపవహ్ని. ౧౩౪

క॥ అంభోరుహాక్షి! వినునే
సంభోగాశక్తుఁడగుచు శౌనకతమునఁ
సంభావనీయ్య నియతిని
సంభవమాగాక సుతుఁడు సతి నీ కెలమిఁ ౧౩౫

ఉ॥ నారి! మదీయ కాంక్షిత మొఁర్పుము నీవు; గృహస్థ సౌఖ్యమిం
పారఁగ దార చేఁగనును భర్త వసుంధరఁ గాదె? నేనఁగో!
నీరజలోచనా! మిముల నేరరమింప, మునీంద్రశేప్తుఁడఁ
భూరిమహారాజసుఁ బురుషపూజ్యుని కూర్మినిఁ బుత్రునొందుమా ౧౩౬

కం॥ ఉవిదా! పుత్రవతివి నీ
వవుటకు శంకింతు వేని నాపాండువగుఁ
దివిజేంద్రుఁ డొకఁడుఁ గాదీ
భువి నాతని గోత్రమెల్ల బుద్ధి నెఱుఁగుమా ౧౩౭

చ॥ విని యలివేణి భర్తఁగని విన్నప మొక్కటి విన్నవించెదఁ
గనుము; యనుక్తపూర్వ వచనంబు విగర్హితకృత్యమిద్ది, నే
వినఁగన నిట్టి దెచ్చటను విజ్ఞులు మెత్తురె? కుంతి యన్యుఁ ద
ల్చిన వనధిఁ దవ్య జించి సురసింధువు తల్పదె పల్వలంబునుఁ ౧౩౮

చ॥ అని వినిపించిన న్వినక యల్లనఁ బూర్వ నిదర్శనంబు తె
ల్లనుగల వేదశాస్త్రములు లక్ష్యములు న్వివరించి పేఁడు నా
థునిఁగని జంకుచు న్వినిచెఁ దోషిత సంయమిదత్త మంత్రహా
ధనఫలమెల్లఁ; దెల్పదయె దాని పరిక్షణకృత్యమేమియుఁ ౧౩౯

ఉ॥ మానవనాథుఁడా సతికి మంత్రబలంబునఁ బుత్రుఁ గాంచుమం
చానతియియ్య నత్తరుణి యప్పుడ ధర్ముని మంత్రసంపదన్
బూనుచుఁ బిల్చె నాయముఁడు పొందె నమంద ముదాతిరేక మా
చానసుఁ గూడి వేడుకలఁ జంద్రుఁడు తారను గూడు రీతిగన్ ౧౪౦

క॥ అభిజిన్ముహూర్తమందున
శుభదినమునఁ బృథకుఁ బుట్టె సుతుఁడు పునీతుం
డభవు జటాజూటమునన్
బ్రభవించిన గంగబోలెఁ బావనుఁడగుచున్ ౧౪౧

క॥ తనయుని మోమును గనఁగనె
తనువెల్లను బులకలెగసె ధరణీపతికిన్
మనమునఁ బొంగెడు ముదమున
కును నవకాశంబు నియ్యఁ గోరియొ నాఁగన్. ౧౪౨

తే॥ గీ॥ ఆయుధిష్ఠిరుఁడిల జన్మమంద, మోద
మందె సురగణ మబ్ధులు నన్నిదిశలు
నొందెను ప్రసత్తి నామోద మందె సుజన
తతియు తరుసుమవితతియుఁ దనివిఁ జెందె. ౧౪౩

సీ॥ తనయునిఁ గనెఁ గుంతి యనువార్త గాంధారి
విని యసూయతఁ బూని తనదు గర్భ
మును నొక్క పాషాణమునఁ జీలఁ గొట్టఁగఁ,
బారాశరుఁడు వచ్చి భానుఁడుదయ
మున సాంధ్యరాగత నెనసిన శిథిలాభ్ర
గగనంబుఁ గాంచిన కరణి, భగ్న
రక్తపేశియుఁ జూచి రక్షించు తలఁపూని
వాని నంతయుఁ గూర్చి వాసిమీఱ.

తే॥ గీ॥ కరుణ నా పేశి నూరు భాగములు సేసి
నేతికడవల నవియుంచి చేతనంటి
యున్న పిశితంబు నెల్లను నొక్క కలశ
మందు నుంచుచు సౌబల కనియె నిటుల ౧౪౪.

చ॥ వ్యసనము మానుమా సతిరో! వ్యర్థముగాదు మదీయవాక్యమిం
పెసఁగను మున్నుఁ బుత్రశతమిచ్చితి, హెచ్చుగ నొక్క కన్యయున్
బొసఁగును నీకు, నీ కలశము ల్దమయంతన విచ్చుకొన్నచో
నసదృశ తేజమున్గలిగి యందఱు వెల్గెడువారు నమ్ముమా ౧౪౫.

కం॥ వనిత ముదమంది యాత్మజు
లనునుంచిన కలశములను లక్షణమగు నా
సనములనిడుచు మహోరగి
తన యండము లోమురీతిఁ దా రక్షించెన్. ౧౪౬.

కం॥ కనెఁ గుంతి శుభముహూర్తము
నను మధ్యాహ్నంబునందు నాగబలుని భీ
ముని బవను కరుణ నం
జన మారుతిఁ గనినరీతి జనులు పొగడఁగన్. ౧౪౭

కం॥ తనయుని జననాశుచిచే
జనులను స్పర్శింప వెఱచి చనునోయన మె
ల్లనఁ బవనుఁడు నడకను గనె
ఘనసామోదతనునంది క్రాలి తిరుగుచున్ ౧౪౮.

తే॥ గీ॥ కుసుమమిషఁ బూని పవనుఁడు గురిసెఁ బ్రమద
బాష్పములు సౌహార్దమునకును భవ్యముగను
సుతుఁ డుజనించె నని పక్షివితతి శిఖల
హర్షనృత్యంబు సల్పె నో యనఁగ నొప్పె. ౧౪౯.

తే॥ గీ॥ పవనసూనుఁడు పుట్టిన దివసమునకుఁ
బూర్వనిశిని సుయోధనుం డుర్విఁబుట్టె
నంబుధరములు రక్తవర్షంబుఁగురిసి
ప్రమదబాష్పములను గార్చి ప్రజల ముంచె
నక్క కూతల నుత్సవనాద మడఁగె. ౧౫౦.

క॥ వరుస శతవాసరములకు
శరారువృత్తులగు వారు జనియించి రిలన్
గురుకుల భూషణమై యొక
తరుణీమణి దుశ్శలాఖ్యఁదగ జన్మించెన్. ౧౫౧.

కం॥ వదలక పార్శ్వస్థితులై
ముదమున సుతశతక మటుల ముదితయుఁగూడన్
మదపతి సౌబల యొప్పెను
గద శతపత్రంబు లక్ష్మి కర్ణికల బలెన్ ౧౫౨.

క॥ మరల తనభర్త యానతిఁ
దరుణీమణికుంతి యింద్రుఁ దలఁచిన నతఁడున్
సరసరతిఁ జానఁగూడెను,
సురనది దిగ్గజము రీతి సుఖమొనఁగూడన్. ౧౫౩.

సీ॥ ఫాల్గునమాస సంపద్దినోదయలగ్న
మునను నుత్తరఫల్గునిని సుజన్ము
మునుగాంచెను త్రిలోకమును జయించునటంచు
నిశకీర్తి మున్మన్నఁజెందెఁదన్ను
ననఁజెల్లు శుభ్ర కాయంబునఁ బుత్రుఁడ
ర్జున నామధేయంబు రూఢిగాను
నుత్తరఫల్గుని నుద్భవించెను గాన
ఫల్గునుండను పేరఁబరఁగెనతఁడు.

తే॥గీ॥ అమరకుసుమపరాగముల్ హస్తములను
బట్టి నృత్తోచితంబగు భూరితూర్య
నిస్వనంబుల నచ్చరల్ నిండివెలయు
నద్రిశృంగముఁజేరె మహర్షిగణము. ౧౫౪.

క॥ దయితుని యానతి మీఱక
దయఁబృథ తన సవతికిచ్చెఁ దనమంత్రమునున్
గయికొనిన మాద్రి, పుత్ర
ద్వయమిండని యశ్విలను ముదంబునఁబిలిచెన్. ౧౫౫.

క॥ వారిని నెమ్మదిఁ గూడుచు
వారిజముఖి మాద్రి కనియె వరుస నిరువురన్
బూరుని కులభూషణుఁడగు
సారయశు న్నకులు, భవ్య సహదేవు, వహిన్. ౧౫౬.

తే॥ గీ॥ అమరతరు లెటు లటుల యుదారులగుచు
మరుని శరములబలె మనోహరులు నగుచు
జలజసంభవు భూతపంచకము రీతి
వెలయు సుతపంచకముచేత వెలసె నృపతి ౧౫౭

మ॥ అలధాత్ర్యంగుళిపల్లవ గ్రహణమా యాధారముల్ లేక; ప
ల్కులనేర్పుంగల వేత్రిచాటువుల పలుకుల్ వీనులన్ సోక కా
మలలోఁ జంక్రమణోచితాంఘ్రులగుచున్ మాటల్ మహానీతులున్
గలయన్నేర్చిరి బాలురౌర నిజవిజ్ఞానంబునన్ గ్రాలుచున్ ౧౫౮.

కం॥ యతిసుతులచేత నుపలా
లితు లగుచును బాంసుకేళి లీలారతులై
యతుల తపోవన గజముల
గతి హరిసట లీడ్చు చుండ్రు గతభయులగుచున్ ౧౫౯.

చం॥ సుతు లుపసేతులై శ్రుతులసూక్ష్మములన్ని యెఱింగి విద్యలా
తతముగ నేర్చి భాసిలుకతంబున ధన్యతనొందె భారతీ.
పతుల కులంబగాదు మఱి వారలఁ బేర్కొనువారిసంతతిన్
గతలయె వీరివార్త లిలఁ గాంచినవారికి శ్రేయదంబులై. ౧౬౦

చం॥ క్రమమున యౌవనంబు త్రిజగంబునకున్ సుఖమిచ్చి వారి దే
హముల నలంకరించెను సుఖావహమౌగతి. సౌరభమ్ము భృం
గములకు సంతసంబొసఁగి క్రమ్మనవీన సరోరుహంబులన్
దమిని ననుగ్రహించి శుభదాయకమౌగతి నబ్బురంబుగన్ ౧౬౧.

కం॥ నిడుదలయె భుజములంబలె
వెడదయె వక్షస్థలాధి వృద్ధియుంబలెఁ సొం
పిడు స్వరముంబలె మంద్రత
బడెఁ గనుఁగవ స్నిగ్ధభావ బంధురమగుచున్. ౧౬౨.

మ॥ స్మరమత్తేభమదోద్గమంబుఁ బికసుస్వానోదయోత్సాహమున్
నిరపాయావహ మందమారుతమునున్ నిండారఁ బుట్టించు వా
సరసంశోభిత చైత్రమాస మవనిన్ జన్మించి మించె న్దిశల్
విరహం బగ్గలమయ్యె భూతతతికిన్ విందాయె భృంగాళికిన్ ౧౬౩.

ఉ॥ బాలసమీరవారమెగవైచిన బాలరసాలరేణువుల్
లాలితమై చెలంగు వనలక్ష్మికిఁ జల్లిన బుక్క పిండియై
గాలముఁబట్టి నిశ్చలతఁ గాచిన కాయజమంత్రవాదికిన్
సోలు వియోగిలోకులను జొక్కఁగఁజేసెడి చూర్ణమయ్యెఁగా ౧౬౪.

తే॥ గీ॥ సకల లతలను గలిగెడి సౌరభమ్ము
ధరణి నలుదిక్కులను వాసితముగఁ జేయు
చైత్రునకు నబ్బదయ్యెఁగా జాతిగంధ
మవని సంపూర్ణ సంపద యెవనికబ్బు? ౧౬౫.

ఉ॥ వాయువుచే రజఃకణ మవారిగ వెల్వడి రోఁజుచుండు కెం
జాయలచే నశోకకుజశాఖసుమావళిఁగాంచనయ్యె నా
గ్నేయశరోత్కరంబుగను, కీడ్పడినట్టి వియోగిసంతతిన్
గాయము నాయమున్దవిలి కందఁగఁజేయఁగఁ బుష్పధన్వికిన్ ౧౬౬

తే॥ గీ॥ పువులరసమను స్వేదబిందువులు దవిలి
లలి నవోద్గమ కేసరావళులు బొలిచె
వనవనిత మాధవుని స్పర్శమునఁ జెలంగ
నగపడిన స్వేదపులకాంకరాళి యనఁగ. ౧౬౭

ఉ॥ దక్షిణదిఙ్ముఖాగత కృతాంతుని దూతను బోలుచున్ వడిన్
దక్షిణమందమారుతము ధారణినేతను గాలచోదితున్
రక్షితపూర్ణయౌవనుని రమ్మని యీడ్చెనొ నాఁగ మాద్రితో
నాక్షితిపాలుఁడేగెను విహారమతిన్ వనికిన్ రయంబునన్ ౧౬౮

సీ॥ అల సుశీతలతలములు, సుకేసరసీధు
శీకరంబులును వశీకృతులయి
రతిప్రగల్భతమించి రమియించు శుకములు
పంచమస్వనములఁ బరఁగుపికము
లును వనలక్ష్మియు మనమునఁ జిరకాల
సుప్తుఁడై వెడలక సోలిపడిన
స్మరుని లేపిన వాని శరధారలకుఁజిక్కి
సుమగంధగర్భిత సుపదమైన

తే॥ గీ॥ మాధవీమండపముఁ జేరి మరులుగూరి
తపసిశాపంబుఁదలఁచుచుఁ దత్తరంబు
నొందు మాద్రిని నబల నింపొందనీడ్చె
పంచశరపీడితుండయి పాండునృపతి. ౧౬౯

కం॥ సురతాంత సుఖఫలంబగు
పరాసుభావంబు నేత్రభావము దెలుపన్
స్మరుని శరశయ్యఁ బోలెడి
విరిపాన్పునఁబడియె నృపతి విగతాసువుగన్ ౧౭౦.

కం॥ అటుపడిన పతినిఁగనుచున్
గుటిలాలక భీతినంది కుందుచు నకటా!
యెటులాయె దైవగతి యని
పటుతరరోదనము సల్పి పడె ధారణిపై. ౧౭౧.

కం॥ ఆరోదనంబు వినుచుఁ గు
మారులతో మునులతోడ మానిని పృథ తాఁ
జేరెవని నచటఁగనెఁగురు
వీరుని విధిహతుని మాధవీకుంజమునన్ ౧౭౨.

ఉ॥ ఏమిది! యెంత కార్యమయె! నింతటిలో నని చింతఁగుందుచున్
గోమలి సోలి వ్రాలి యెదఁగొట్టికొనెన్ మఱి విహ్వలాంగియై
భూమిపయిన్ బడెన్ మరల భూపతిఁ జూచుచు నశ్రుధారలన్
దోముచు మోము, మూర్ఛిలెను దొడ్డ విపత్తని సూనులేడ్వఁగన్ ౧౭౨.

ఆ॥ వె॥ మూర్ఛమునిఁగి లేచి మున్నీరుగా నశ్రు
ధారలొలుకు పృథనుఁజేరి మునులు
నాశ్వసించుచుండ నాయింతిపదముల
వ్రాలి పలికె మాద్రి జాలిసోలి. ౧౭౩.

క॥ పతి దివిఁజేరెను నాకై
యతని వియోగంబు నోప నంపుము నన్నున్
బతిచనినగతికి సాధ్వీ!
సుతుల ననాథలను నీవు చూడుము ప్రీతిన్. ౧౭౪.

ఆ॥ వె॥ కార్యభార మరసి కాలంబుఁ గడపుచు
సుతులఁ బ్రోవవమ్మ సుదతియనుచు
నశ్రువులను గార్చు నాత్మజులను నూఱ
డించి పతినిఁ జేరె నంచితముగ. ౧౭౫.

కం॥ పిదపఁ బితృమేధకర్మలఁ
జదురగు ద్విజవరులఁ గూడి సమయో చితమౌ
విధులను నెఱవేర్చెను గో
విదుఁడు యుధిష్ఠిరుఁడు వేదవిమలయనుజ్ఞన్. ౧౭౬.

కం॥ యతులఁ గని మ్రొక్కి మాద్రియు
సతిఁ గుంతినిఁ గాంచి సాధ్వి! క్షమియింపుము నే
మతిచెడి యీరసమునఁ జే
సితిఁ దప్పులు చాల నీకుఁ జేసెద నతులన్ ౧౭౭.

కం॥ అనిపలికి సుతుల నాలిం
గన మొనరిచి యశ్రుధారఁ గడఁద్రోసి జము
స్వనమునఁ జితికిఁ బ్రదక్షిణ
మును సలుపుచుఁ జొచ్చెనందు ముదమున నంతన్. ౧౭౮.

కం॥ సతిపతులకు నపరక్రియ
లతిభక్తిని సల్పి ముగిసినంతట వారిన్
వెతఁ జెందు పృథను గరిపురి
జతనంబుగఁ జేర్చి రచటి సత్త్రములు వెసన్. ౧౭౯.

క॥ అనుజుని మృతివిని వ్యసనము
గను ధృతరాష్ట్రుండు మఱచెఁ గన్నఱ వానిన్
దనయులనుఁ గరుణఁ గనుచును
ననవరతము వారి యెడల నధికప్రియుఁడై. ౧౮౦.

మ॥ మితియంతింతని చెప్పరాని బలముఁ మీఱంగ భీముండు దా
సతతంబుఁ ధృతరాష్ట్రనందనులకుఁ సంతాపముఁ జల్పఁగఁ
గుతకంబంచు వారిఖేలనములఁ గ్రోధించి భంగించు. స
ర్పతతిఁగాంచిన వైనతేయువిధముఁ బ్రఖ్యాతిగాఁ జూపుచుఁ.౧౮౧.



# ద్వితీయాశ్వాసము.

ఆ॥ వె॥ కమలగంధ కలిత గంగాజలంబుల
పౌరవాళి కేళి పౌరుషమున
జలిపి శ్రమను జెంది సరవిని దత్తీర
పటగృహంబు నందుఁ బండియుండ. ౧.

తే॥ గీ॥ వారివిహృతి శ్రమంబున భూరినిద్ర
గొనుచుఁ బరవశుఁడైన వృకోదరునకు
సింధుసీకరధారియై సేవఁజేసె
దినవిరామ సమీరంబు తిన్నఁగాను. ౨.

సీ॥ అటుగాఢనిద్రచే నంగముఁదెలియక
పడిన సామీరినిఁబట్టిచంప
ననయము సహితుండు నగు సుయోధనుఁడు తా
వల్లుల బంధించి వాని మడుగు
నందుఁ ద్రోసెను గటా మందరమును భోగి
బంధనంబున నబ్ధిఁబడఁగఁద్రోయు
చందంబుననుఁ; నంత సరసినిఁబడినట్టి
పవనసూనుఁడు లేచి బంధశతము

తే॥గీ॥ భగ్నమొనరించి దరిఁజేరి పవ్వళించె
మరల నదిగని వహ్నిసమాన కాల
కూటమునుగల పాములఁగొన్ని తెచ్చి
కఱవవిడిచిన నవి వానిఁగఱచుచుండె. ౩.

కం॥ అనిలాంగ స్వాదముఁదినఁ
గని రుచిమరగిన భుజంగగణ మప్పుడు త
త్తనయుని యం దారుచిఁగని
ఘనతరముగ మెసవె వాని కాయమునంతక్. ౪.

కం॥ వాతాశన వనదేవత
లాతజి నాశీర్ద్వయంబు నంగాయువులన్
ప్రీతినిడ మొదటి దయె వృథ
యాతతముగఁ జరమువాక్య మందె ఫలంబున్. ౫

ఉ॥ వానిని దంతకోటి విషవహ్నులఁ గ్రాలెడు వాని నిర్దయన్
బూనుచు నాయముల్గఱచి భోగములెత్తెడివాని నిద్రకున్
హానియొనర్చువానిఁ గనినంతన నల్లులబోలె రాచె నా
మానితసత్త్వుఁడైన పవమానసుతుం డటు నిద్రఁబోవుచున్ ౬

క॥ అదికని సుయోధనుఁడు వెత
మదిఁగొని యెటులైన భీముమరణమును గనన్
ముదమందుచు సహపఙ్క్తిని
నదయత విషకబళమిడియె నన్నములోనన్ ౭

ఉ॥ దాని భుజించి విహ్వలతఁదాల్చిన భీమునిఁబాశబద్ధునిన్
గా నొనరించి శూలములు గాఢముగా హ్రదమందుఁబాతి గం
గానదిలోనఁ ద్రోయుఁడని కట్టడిసేయఁగ గింకరాళియున్
వానినిఁగట్టి త్రోసి రహో! వారక క్రూరులు గ్రావమున్ బలెన్ ౮

క॥ పవమానాశన లోకము
పవమాన సుతుండు జేరెఁ బన్నగశిశువుల్
దవిలి తమవిషము నింపఁగ
భువి నొదవిన విషము వెళ్ళఁబొంగుచుఁ బోయెన్. ౯

ఉ॥ ఆదటఁబాశబంధముల నన్నియుఁ బాయఁగఁగోసివైచి య
త్యాదరతన్ గజాయుత బలావహమైన రసంబుఁ గ్రోలఁ గా
కోదర నేతయాజ్ఞ దశకుంభముల న్వడిఁ దెచ్చియుంచినన్,
గాదనకా వృకోదరుఁడు గ్రాలెడుదప్పిని గ్రోలె నంతయున్ ౧౦

ఆ॥వె॥ అటులఁదృప్తినొంది యష్టదినంబులు
శ్రమనివారితముగ శయనమునను
నిద్రఁబోయె, నబ్ధినీరముఁద్రావుచు
దరిని నున్న నీరదమునుబోలె. ౧౧

కం॥ మారుతిని నీటఁద్రోయుచు
క్రూరులు కౌరవులు శకునిఁగూడుచుఁ బురినిన్
జేరుచుఁ బూర్ణాప్తులతో
భూరిక్రీడలనుఁ బ్రొద్దుపుచ్చిరి నెమ్మిన్. ౧౨

కం॥ కలభము వెదకెడి వాసిత
బలె భీముని వెదకెఁ గుంతి వనతలమందున్
జలధుల నదులను సరసుల
వెలినెలవుల నెల్ల వెదకి వేసారెఁ గటా! ౧౩

చం॥ సుతుని సుయోధనుం డకట ద్రుక్కఁగఁజేసెనో యంచు భీతిచే
నతి వసుధన్ బడెన్ విదురుసాంత్వనములిచ్చిని చెందెఁ దెల్వియున్;
వితత నిదాఘభాస్కరుని వేడికి ద్రుక్కుచు నోషధీశునిన్
శితకరజాల మంటఁగనె సేదలువాయు నభంబునైవడిన్ ౧౪

క॥ తొమ్మిది దినములు భీముఁడు
నెమ్మదిగాఁదల్పమందు నిదురించుచుఁ దాఁ
బిమ్మట సర్పాళ్వొందై
నెమ్మినిఁ దీరమ్ముఁజేరె నిరపాయుండై. ౧౫

ఆ॥వె॥ దరిని జేర్చి ఫణులు తామేగ భీముఁడు
గరిపురంబుఁజేరెఁ, గౌరవాళి
కుందె; భ్రాతృవరులుఁ గుంతియుఁ బౌరులు
మోద సిన్ధు యముల మునిఁగి రంత. ౧౬

క॥ సకలాస్త్ర కోవిదుండును
సకలంకాచారశీలుఁడయిన కృపుని రా
జకుమారులకుఁ గురువుగఁ
బ్రకటించె సరిత్సుతుండు బాలురకెల్లన్. ౧౭.

చం॥ మనుములు వారివద్దఁగడు మాన్యత నేర్చిన పెక్కు విద్యలున్
గనియును గోరె భీష్ముఁడు ప్రగల్భత నత్యధికంబుగాను నొం
దిన గురువర్యునన్యుని, మదిన్దలపోయుచు నుండెనార! భూ
జనులు గుణోత్తరాధికత సంతత మారయుచుందు రెమ్మెయిన్ ౧౮.

తే॥ గీ॥ పరశురామునిచే నస్త్రపాండితిఁగని
యిలను బ్రఖ్యాతిఁగన్న ద్రోణులనుఁ బిలువఁ
బంపనుండినతఱిని నాపట్టణంబుఁ
జేరవచ్చిరి వారు నారారవింత. ౧౯.

తే॥ గీ॥ విక్రమాన్వితమైనట్టి విద్యబలెను
పుత్రయుతయగు భార్య తన్బొంది రాగఁ
గుంభజుఁడు భీష్మ సత్కృతిఁ గొనుచు సభను
నిలిచి గంభీరతరముగఁ బలికె నిటుల. ౨౦.

చ॥ స్థిరముగ నగ్నిదేశ్యముని సేవను నేనును యజ్ఞసేనుఁడున్
గురుతర విద్య లన్నియునుఁ గూడి పఠించెడి కాలమందు, నా
ధరణిప సూనుఁడాడెఁగద తా ధరణీధవుఁడయ్యె నేని న
త్యురుతర రాజ్యమర్ధమును నొప్పఁగ నిచ్చెద నంచు దారతన్ ౨౧.

క॥ క్రమమునఁ బైతృకరాజ్యము
నమరెను నాసుహృదవరున కనుచు నలరినన్
శమదమ భూషణులను క్రే
యముగాదీ రాజసేవ యని పోనైతిన్. ౨౨.

ఆ॥వె॥ దుగ్ధకాంక్షమైన ముగ్ధ నీ శిశువును
పిష్టరసము ద్రావి హృష్టఁ జేయఁ
జింతనందు గృపుని చెల్లెలి యూఱట
గనఁగ మనమునందుఁ గలక తేరి. ౨౩.

తే॥గీ॥ దైన్యవృత్తికిఁ బుట్టుకతానమయ్యె
యాచనావిధి, యైన నేనాచరింతుఁ
దమకుటుంబము రక్షింప ధర్మపథము
నైన విడనాడఁ దగునని యనిరె స్మృతులు. ౨౪.

చ॥ అనుచును నిశ్చయించి ద్రుపదావనిఁ జేరి నృపాలుఁ గాంచి నే
వినిచితి నీ సఖుండనని విన్నను వొప్పఁగ, నంతవాఁడు గ
న్నను మొగమెత్తఁ జేసికొని కన్నుల నిప్పులుగ్రక్కి సొక్కి ప
లెఱుఁగద సోపహాసముగఁ గేరడము ల్పచరించి మత్తుఁడై ౨౫.

తే॥గీ॥ వ్యసనవశులగు బ్రాహ్మణవంశమేడ
సత్త్వసంపన్నులగు బాహుజన్మలేడ
కాచరత్నోపమం బవుఁగాదె? వీని
కగునె మిత్రత్వ మెచ్చటనైనఁ జూడ?

చ॥ ఇటులహితప్రలాపముల నించుక యేనియు శంకలేక వాఁ
డటుల వచింప సిగ్గుపడి హాయని చింతనుఁగుంది యప్పుడే
పటుభుజసత్త్వులై వెలయు పౌత్రులు నీదు మదీయవాంఛితం
బెటులయొ నేఁ దీర్తురని యిచ్చటికిన్ నృప! వచ్చితిన్వడిన్. ౨౬.

కం॥ అనవిని కురూద్వహులకున్
జను నీ గురుఁడనుచు సంతసం బంది వడిన్
ధనమాది నిచ్చి పిదపన్
దనపౌత్రులనిచ్చె భక్తి దైవారంగన్. ౨౭.

తే॥ గీ రేణుకాసూనుపాదాబ్జరేణుకలనఁ
బావనుండగు ద్రోణుచే బాలవితతి
యంపవిద్దెల విధుల శిక్షింపఁబడెను
ధన్విదర్పంబుబలె వసుంధరను సరవి. ౨౯.

క॥ భూతలతిలకుం డర్జునుఁ
డాతతగుణసహితమౌ శరాసనమునఁ బ్ర
ఖ్యాతిగ గురువుల మనమును
నేతఱి నేమరక భక్తి నీడ్చుచు నుండెన్. ౩౦.

క॥ ఎన్నఁడొ గురునానతిఁగొని
యన్నరుని న్మించునట్టి యస్త్రవిదుండై
యున్నట్టి యేకలవ్యుఁడు
విన్నంబడ వాని బొటనవ్రేలుం గొనియెన్. ౩౧.

తే॥ గీ చెట్టుకొనకొమ్మఁగట్టిన యట్టి గుఱిని
శరమునేయుచుఁ దెగఁగొట్టె నరుఁడు దాని
తోడ నన్యులధన్వులఁ గూడియున్న
మత్సరంబునుఁ దెగఁగొట్టె మాన్యుఁడగుచు. ౩౨.

కం॥ మడుగున ద్రోణుని యడుగుల్
వడిఁ బట్టిన మొసలిఁజంపి పరమసుఖముఁ దా
నిడుచును గురునకు, నూఱుగఁ
బడసెను దివ్యాస్త్రమొండు పల్గునుఁ డెలమిన్. ౩౩.

సీ॥ పదఁపడి ద్రోణుండు పార్థివతనయుల
శస్త్రాస్త్రకుశలత సరవిఁజూప
శిల్పికల్పితము ననల్పభూషితమును
నగు రంగమునుఁజేరి నచట సకల

పార్థివులును జానపద పౌరులునుఁ జూడ
వచ్చినిండిరి మఱి వాసవాది
నిర్జరులెల్లరు నిండిరి నభమున
నంత ధనుర్ధారులగుచు ధర్మ

ఆ॥వె॥ నందనాదిశిష్యబృందము స్థూల సూ
క్ష్మ చల నిశ్చలాదికముల నొప్పు
లక్ష్యములను బాణలాఘవంబునఁద్రుంచి
మించి రచటిజనులు మేలనంగ ౩౪.

ఆ॥వె॥ ఖడ్గముద్గరాది కఠినాయుధ పరిశ్ర
మంబుఁజూపి రద్భుతంబుగాను
వాజివారణాది వాహనచర్యచే
గొంద అమిత ముదముఁ గొల్పిరంత. ౩౫

తే॥గీ॥ సాలకుజములఁ బూనిన సామజముల
బలె సుయోధన భీము లుద్భట భయంక
రావహంబగు గదలచే నాక్షణమున
రంగ భూమినిఁజేరిరి రహిఁదలిర్ప. ౩౬.

తే॥గీ॥ వివిధగతులను గదలను వీచి వీచి
యొకనిపైఁబడ నొకఁడు దా నుద్యమించి
కినుక హుమ్మని కీడించి చెనకఁబూన
ద్రోణసూనుండు వారించెఁ దొలఁగుఁడనుచు. ౩౭.

చం॥ గురుచరణాంబుజాతములకున్ నతిఁజేసిన కారణంబునన్
శిరము పవిత్రమయ్యెనను శిష్యుఁడు పార్థుఁడు ద్రోణు నానతిన్
శిరమునఁబూని రంగమునుఁజేరెను బాణవితాన యుక్తుఁడై
ధరణిపులెల్లరున్ గనుచు దద్దయు విస్మయ మందుచుండఁగన్ ౩౮.

తే॥గీ॥ వ్యాడ తిమిరార్క ఘనధర వహ్ని తార్క్ష్య
హస్తి కేసరి ముఖ దైవతాస్త్ర జాత
ముల పరిశ్రమ నైపుణి వెలయఁ జూపె
సంసదులు మెచ్చి తలయూఁచి సంస్తుతింప. ౩౯.

తే॥గీ॥ సింహ సంహననత్వముఁ జెలఁగుచుండ
సింహనాదము దశదిశల్ చెంగలింప
రంగ సద్మముఁ జేరి యా రవిసుతుండు
చాపవిద్యాధికతఁ జూపె సంసదులకు. ౪౦.

తే॥గీ॥ శస్త్ర సంపదఁ గనిన యా సభ్యులెల్ల
విస్మయంబందఁ బార్థుని క్రీడ కూడె.
నాసుయోధనుఁడును వాని యనుజతతియుఁ
దానిఁ గని మోదమంది రనూనముగను. ౪౧.

మ॥ నరుఁ డేపాటి నరుండు నాకుఁ? గనఁ బూనన్ ద్వంద్వయుద్ధంబునన్
స్థిరుఁడై నిల్చి మదీయసత్త్వమును వాసిన్ జూడ నిండంచు భా
స్కరసూనుం డురు గర్వయుక్తుఁడయి పల్కన్ ధార్తరాష్ట్రుల్ మదిన్
హరుసం బందుచు వీఁడు మాకు సుహృదుండౌ నంచు నుప్పొంగినన్ ౪౨.

చ॥ నరుఁ డరుణాననుం డగుచు నాగము మాడ్కిని నిశ్వసించి యా
యరుణతనూజుఁ జూచి నిశితాశుగము ల్వడి నెత్తి పల్కె నీ
ధర స్వపరాంతరంబులనుఁ దాఁ గనఁ జాలక ప్రల్లదంబు లే
నరుఁడు వచించు వానిగతి నాశర మొందఁగ నిచ్చు నీకనన్ ౪౩.

తే॥గీ॥ ఆహవంబున నిల్వరా యడుగుఁ ద్రొక్కి
పార్థ! యదె నీదు శిరమను పద్మ మిపుడె
యిదిగొ నాశరమునఁ ద్రుంచి యీగ్రహాధి
దేవతార్చనఁ గావింతు ధీరవృత్తి. ౪౪.

చ॥ కని కృపుఁడడ్డమై నిలిచి, కర్ణ! దురుక్తులుచాలు; సూతుఁడై
జననమునొందు నీకెటుల క్షత్రియవారిధి చంద్రుఁడైన యీ
యనఘుని పూరువంశజుని యంగముఁదాకఁగనౌను? మానుమా
చన దిటు లంతరంబెఱుఁగఁ జాలక పల్కుట నిందనీయమౌ. ౪౫

క॥ అని కృపుఁడాడిన మాటలు
విని కర్ణుఁడు శిరమువంచె వ్రీడాయుక్తుం
డును బోలె నంత దుర్యో
ధనుఁడా కృపుఁజూచి పలికెఁ దగదిది యనుచున్. ౪౬

తే॥గీ॥ విప్రపత్రితయంబున విస్తృతౌజ
సుల జనన మూలల మెన్నఁగవలదు; నదుల
యతుల మూలములంబలె నర్థమగునె
శూరుఁడగు వాని జననంబుఁ జూడనెందు? ౪౭

సీ॥ స్తంభోద్భవుఁడు పురాతన పురుషుఁడు గాడె
వానిజన్మము నెంచు వారుగలరె?
మును క్రౌంచ వింధ్యాగముల మథించినవారి
బలె శరకుంభసంభవులు మీరు
నీద్రోణులును గారె? యిదియెన్నఁగా నౌనె?
గుణమున మనుజుఁడు గణనకెక్కుఁ
గాని జన్మంబునఁగా నేర్చునే? పెద్ద
ఘనులు మీరిది యెఱుంగనిదె? యనుచు

తే॥గీ॥ నర్కతనయుని సింహాసనాధిపతిగఁ
జేయుదును నేనటంచని శీఘ్రముగను
వానినొక పీఠమునునుంచి వారిధార
నభిషవ మొనర్చె నంగరాజ్యమున కపుడు. ౪౮

కం॥ రవిసుతుఁడు రాజ్యమును, గౌ
రవు లినసుతు సఖ్యమంది రాజిల్లుచుఁ బాం
డవులను నెన్నక వారికి
నవమానముఁ జేయఁదొడఁగి రదనున నలుకన్ ౪౯.

తే॥గీ॥ అస్త్రజలరాశి పారగులైన రాజ
తనయులనుఁజూచి ద్రోణుఁడు, దక్షులగుచు
ద్రుపదరాజును జెరఁబట్టి యిపుడె యిడుడు
గురుల గురుదక్షిణ యటంచుఁ గూర్మిఁగోరె. ౫౦.

ఉ॥ ఆ వచనంబునున్ శిరసునందు శిరస్త్రములాగు నుంచి యా
భూవిభునందనుల్ పటహభూరినినాదము దిక్తటంబులన్
మ్రోవుచు మాఱుమ్రోతలిడ మూకల కేకలు నింగినిండఁగా
గావచకాది యోధులునుఁ గ్రాలఁగఁజుట్టిరి వైరిదేశమున్ ౫౧.

చం॥ కలశజచోదికంబయిన కౌరవసేన సపత్నపత్తనం
బలవడ ముట్టిచుట్టెఁ; బృషదశ్వుని ప్రేరితమై వలాహకం
బులు వడి మేరుమేఖలను ముట్టడి వేయఁగఁజుట్టు లాగునన్
జలమున లగ్గవట్ట దిమురసాగెను లగ్గుగ సైన్యమంతయున్ ౫౨.

చం॥ ద్రుపదుఁడు కౌరవద్విరద దుర్భరనాదము విన్చి కంధరం
బపరిమితాగ్రహంబునను నాకటిచే విడు సింగమట్లు వి
ష్టప మద్రువన్ ఘనస్వనము చాడ్పున నార్చుచు నిర్గమించెఁ దా
స్వపురిని యోధులున్ బలము వారక చేరఁగవచ్చి రప్పుడున్ ౫౩.

తే॥గీ॥ పార్షదులకును కౌరవబలమునకును
జరుగు రణమొప్పె సజ్జన స్తవ్యమగుచు
తగను పార్థునిశౌర్యమ న్నిగమమునకుఁ
దద్రణంబును బ్రణవమై ధాత్రిలోన. ౫౪.

క॥ ద్రుపదుఁడు గౌరవశతమును
దపియింపన్ జేయఁ గ్రీడి తడయక చని యా
రిపుసైన్యముఁ జెండాడెను
నృపునిన్ దేహంబు గాడ నేయుచు వడిగన్. ౫౫

మ॥ విరథున్ జేసి శరంబులన్ దఱిగినన్ వేఱొద్దియున్ ద్రోవకా
దురమున్ బాయుచుఁ బాఱఁగాం చెడి గురుద్రోహిం బ్రదిష్టైన నా
నరుఁ డుద్దండకృపాణహస్తుఁడగుచున్ స్వాచ్ఛను వాచంద్రు భీ
కరలోలంబగు జిహ్వచే నదుముచున్ గాఱించు చందంబునన్ ౫౬

కం॥ కౌరవయుతుఁడై నరుఁడా
ఘోరమణునిఁ దెచ్చి గురుని ముందలనిడియె, నా
ధారణిపతి తలవంచఁగ
నారాజును జూచి నవ్వి యాచార్యుఁడనెన్. ౫౭

కం॥ జలసక్తమగుచు మిత్రుని
చెలిమినిఁ బెంపొంది పిదపఁ జెలి తేజమునున్
గలయఁగ నోపదు ద్రుపదం
బిల నను వాక్యం బదెట్టు వృథయగును? సఖా! ౫౮

తే॥గీ॥ మానవంతుఁడవై నాడు మానవేంద్ర!
మాన్యవరుఁడైన ద్విజు నవమానపఱచి
తత్ఫలం బిపు డీవు నాతనికి శిష్యు
లైన వీరలచేఁ గంటి వస్తుమిద్ది. ౫౯

చ॥ ధరణిని నర్థభాగమును దప్పక యిచ్చితి వల్లనాఁడు, భూ
సురునకు రాజ్యభోగములు సొంపగునే? నినుఁబోలు ధారణీ
శ్వరునకు మిత్రుఁడై మనుట చాలదె శాశ్వతసఖ్యమూని యా
శ్వరుఁడు కుబేరునిన్ గనెడిచాడ్పున? మేలగుఁబొమ్ము మిత్రమా! ౬౦

మ॥ అనుచున్ సోమకునాదరించి యిఁకఁ బ్రహ్మా మిత్రమా! యంచుము
క్తునిఁ జేయించెను ద్రోణుఁ డంత విభుఁడున్ దుఃఖాబ్ధిలో మున్గుచున్
ఘనుఁడా పార్థుని కార్యమిద్ది యనుచున్ గార్యంబు చేదప్పె నం
చును నాహా! యవమానమిద్ది యనుచున్ సొంపేది చేరె న్సురిన్ ౬౧.

తే॥గీ॥ ఆత్మరిపుద్రోణుఁ జంపెడు నాత్మజుండు
ఫల్గునునిఁ బ్రీతునిగఁ జేయు బ్రమదతనయ
కలుగ నొక యాగ మొనరింపఁదలఁచి ఋష్య
శృంగసమయాజకునిఁ గోరెఁ జిత్తమందు. ౬౨.

తే॥గీ॥ జాహ్నవీతటమందు ద్విజన్మవరుని
యాజుఁడనువానిఁ గని మ్రొక్కె నవని విభుఁడు
తనయభీష్టంబుఁ దెలిపి గోధనము నొసఁగి
ముదముఁ గూర్పఁగ బూన నామునివరుండు. ౬౩.

కం॥ తన యనుజుని సాహాయ్యము
గని నృపవరుచేతఁ బుత్రగర్దనయాగం
బును జేయించె యథావిధి
ఘనుఁడా యాజుండు జనులు గని మోదింపన్. ౬౪.

కం॥ యజనాంతమున హవిస్సును
భుజియింపన్ రమ్మటంచు భూరిహితమునన్
యజమాన గేహినిని నా
ద్విజవరుఁడున్ బిలిచె రాజ్ఞి భీతిని దడసెన్. ౬౫.

కం॥ తడవోర్వక యా యాజుఁడు
కడుకినుకన్ బూని యెంత కాలంబయ్యెన్
జడజాక్షీ! రావైతివి
యిడియెద నీ హవ్య మగ్ని కిపుడని వ్రేల్చెన్. ౬౬.

తే॥గీ॥ కనకగిరి నుద్భవించు వికర్తుని బలె
జాతవేదుని జ్వాలల జననమొంది
నట్టి కొమరునిఁ గాంచిరి యవనిజనులు
వికచపంకజ నయనులై విస్మయముగ. ౭౭.

తే॥గీ॥ కవచకుండల కేయూర కార్ముకాది
సహజసంపదచే నొప్పి మిహిరుమాడ్కి
రథమునందున్న పుత్రుని రాజు చూచి
కార్చెఁ బ్రమదాశ్రువులచాలు కాలువలుగ. ౭౮.

ఉ॥ లౌకిక శంఖతూర్యతుములస్వన మాకసమంటి నిండ నా
ప్రాకటకీర్తి కాముఁడల బాలుఁడు సోమకుఁగూడె; షణ్ముఖుం
డా కఱకంతుఁ జెందినటులయ్యెను; బిమ్మటఁ బట్టణంబు సు
శ్రీకరమౌ విధంబునను జేరిరి, వార్తయుఁ జేరె లోకముల్ ౭౯.

తే॥గీ॥ విప్రవరుచేత సవనహవిస్సు మరల
వేల్పఁబడఁబుట్టె నా జాతవేదుశిఖలఁ
గన్యకామణి; రక్తపంకజవనంబు
నందుఁ బుట్టిన లక్ష్మియో యనఁగ వెలసె. ౮౦.

తే॥గీ॥ అర్జున వికాసమానయౌ యతివవలన
నగును దుర్గర్వులగు క్షత్రియాంతకంబు.
ప్రావృషంబున నూతనపద్మకాన
నంబుపగిదిని యనిపల్కె నభము వడిగ. ౮౧.

కం॥ అనలునివలన న్బుట్టిన
తనయను తనయునినిఁగనుచు ధరణీశుఁడు పొం
దెను ముద మర్జుని కతమునఁ
గనఁడయ్యెను భీతి ద్రోణుకతమున నెపుడున్. ౮౨.

తే॥గీ॥ చేరవచ్చిన శిష్యుఁడు వైరియయిన
సతని సోమకసుతుని సర్వాస్త్రవిదునిఁ
జేసి పంపెను ద్రోణుఁడు? జీవితమున
కంటె సత్ఖ్యాతి కీర్తినిఁ గను ప్రియముగ. ౭౩.

తే॥గీ॥ యౌవ రాజ్యాధిపదవికి నా యుధిష్ఠి
రుని నొనర్చిన నంధుఁడౌ తనకు నయన
ములుగ నుండు నటంచని తలఁచె? నదియుఁ
దెలిసి దుర్యోధనుఁడు వచ్చెఁ దీవ్రముగను. ౭౪.

ఉ॥ నీతి విచారదక్షుఁడను వినీతుఁడునై త్రిజగంబులందుఁ బ్ర
ఖ్యాతినిఁ గన్న ధర్మజునిఁ గాంచి సుయోధనుఁ డోర్వఁడయ్యె వి
ఖ్యాతినిఁ గన్న పూరుషునిఁ గాంచిన జ్ఞాతుల మానసంబునుకా
భూతలమందుఁ బావకుఁడు భూరిగఁ గాల్చుట నైజమేకదా? ౭౫.

సీ॥ తాత నే నొకయుపంతము వింటి! నిప్పుడ
ధర్మసూనుని నీవు తగునటంచు
యువరాజునిఁగఁ జేయ నుద్యమించితివని
నిజమగునదియేని నీతి కాదు,
చైత్ర పికధ్వని సామ్యమౌ మధురతఁ
గలిగిన వాక్కుల వెలయువాఁడు
ధర్మసూనుండని ధారుణిజను లెల్ల
నేకమై నుతియింతు రతిశయముగ.

తే॥గీ॥ యౌవరాజ్యము వాఁడిపు డందెనేని
నెల్లరును మేము జచ్చుట దృఢము గాదె?
అట్టి యాపద మమ్ముల నంటనకుఁ
గాచునది నీదు భారము గాదె? తండ్రి! ౭౬.

చ॥ అనిన సుయోధను న్గనుచు నంబికసూనుఁడుపల్కెఁ బుత్ర! నీ
మనమునుఁగంటి నిట్టిపతి మాయురె! చాలును. పాండునట్లు నా
కనయముఁగూర్చువాఁడు వినయాన్వితుఁడెల్లరు నాదరించు వాఁ
డనఘుఁడు బంధుమిత్రుఁడగు నాఘను దూఱుటఁ జాలు మర్మతీ! ౭౭.

సీ॥ దుర్యోధనా! యిట్టిదుర్బుద్ధి తగదురా!
పాండవులనుఁగూడి యుండు టుచిత
మగునుర యని తెల్ప నాసుయోధనుఁడనెఁ
దాత! నీవచనంబు తగదు వినుము
సురనదీసూనుండు గురుఁడుఁదత్పుత్రుండుఁ
దన్మాతులుండును ధర్మమెఱిఁగి
హితులగుదురు నాకు నిటఁ బృథాసుతులేరు
లేరేనిఁగావున వారణావ

తే॥గీ॥ తికినిఁ బంపుము వారినిఁ దీవ్రముగను
నిచటవారున్న జనులకు హితులగుదురు
వేరుసాగుచుఁ బెఱిగిన పెద్దచెట్టు
నెటులవశమగు భేదింప? నిదియ హితము. ౭౮.

క॥ కుంతీనందను లచ్చట
సంతసముననుందు, రిచట జనకా! నీకున్
సంతసముగ నేనుండుదు
నింతటితోఁ గలఁతలణఁగు నిదిహితము గదా? ౭౯.

మ॥ తనయుండీగతి నాడు మాటలకుఁ జింతన్జెంది హా! హా! యటం
చని దుష్టాత్మకుఁడయ్యె నాత్మజుఁడయో న్యాయంబుగాదీ విధం
బని కుంభీకుంభిత ప్రహ్వోదకము సామ్యంబైన చిత్తంబునన్
గనలేడయ్యెను స్వచ్ఛతన్ విభుఁడు కానన్ మౌనముద్రుండయెన్ ౮౦.

తే॥గీ॥ పెద్దకాలంబు యోజించి పిదప ధర్మ
తనయునింజూచి పలికె నాధరణివిభుఁడు
వారణావతికినిఁ బొమ్ము వత్స! యచట
శంకరోత్సవ మగు నది శంకరమ్ము. ౮౧.

తే॥గీ॥ రాజభవనంబు నచట నేరమణ మీఱఁ
జేయుదును నీకు వసతికి, సేవకులను
గూర్తునీకును భ్రాతృలఁగూడి యచట
నధివసనముగాఁగల యవని నేలు. ౮౨.

చ॥ అని ధృతరాష్ట్రుఁడాడఁగఁ దదాశయముఙ్గని ధీరవర్యుఁడా
ఘనుని పదాంబుజంబులనుఁ గైకొనిమ్రొక్కి తదీయశాసనం
బును శిరసావహించి గురుముఖ్యులకున్నతులాచరించి తాఁ
జనియెను వారణావతికిఁ జయ్యనఁదమ్ములుఁ దల్లిఁదోడుగ౯. ౮౩.

ఉ॥ అంతకుమున్న కౌరవుని యానతిఁబూనుచు నప్పురంబున౯
వింతగు జాతుషంబయిన వీటినిఁగట్టి తదాలయంబున౯
గుంతి కుమారులుండ వధకున్గుతిఁ జేయఁగఁ గాచియుండె నా
హంత పురోచనుండయొ! నిశాంతముఁ జేరిన వ్యాళమున్బలె౯. ౮౪.

తే॥గీ॥ పౌరలోచన శశియయి పరఁగుధర్మ
తనయుఁడాపురిఁ జేరిన తక్షణంబ
నతని సరసకుఁజని నతులాచరించి
మందిరంబున దించె నమాత్యుఁడపుడు. ౮౫.

కం॥ దారుణ విషవహ్నులచే
మారణకృత్యంబు సలుపు మంత్రి దురాత్ముం
డారయుఁడని విదురునిచే
గోరంబడి యుండిరచటఁ గొంకుచు మదిలో౯. ౮౬.

ఉ॥ ఆపదవాని నుండి యగునంచని శంకనుబూని వంచకుం
డేపగిదిన్ బదార్థముల నిచ్చిన వానిఁబరీక్షలేక తా
మోపరు కట్టఁబూయఁదిన, నోర్చిరి యైనను వానిసంగతిన్
భూపతి యాజ్ఞఁబూని యిటుపోయెను గొన్నిదినంబులచ్చటన్ ౮౭.

కం॥ మృగయా విహారమిషచే
బగలెల్లను వనులనుండి భవనంబునఁ బ
న్నగమున్న భంగి రాత్రులు
దిగులున నిర్నిద్రమైరి దేవతలబలెన్. ౮౮.

ఆ॥వె॥ మంత్రి సుప్తుఁడగుచు మందిరంబుననుండ
నిప్పుబెట్టి వివరనిర్మితమగు
బిలమునుండి వెడలె భీముఁడు తల్లితో
భ్రాతృవరులతోడ భద్రముగను. ౮౯.

తే॥గీ॥ అలధనంజయ విద్వేషియైన ఖలుని
బిలుకుమార్చెదనన బహుభీకరముగ
నట్టహాసంబు సేయుచు నలుకఁబూని
యార్చుచున్నాఁడో యన నొప్పె ననలుఁడపుడు. ౯౦.

తే॥గీ॥ కుంతికినిఁగూర్చు దాసియై మంతనమున
మంత్రికిని లొగ్గి విషగర్భ తంత్రఫలము
నామె కందించు క్రూరాత్మురాలు పంచఁ
బంచసుతయుతయై వహ్నిఁబంచతఁగనె. ౯౧.

చ॥ ఉదయమున న్పురంబునను నున్నజను ల్గుమిగూడివచ్చి బూ
డిదయయి యున్నయాలయము డీల్పడికాంచుచు ద్వారమందునన్
సుదతినిఁ బుత్రపంచకముఁజూచుచుఁ గుంతియు నామెనందనుల్
వదలిరి ప్రాణవాయువులు వహ్నినటంచని యేడ్చిరెంతయున్ ౯౨.

కం॥ వినిరివ్వార్తయుఁ గరిపుర
జను లెల్లరు వినినయపుడె జాతుషగృహముఁ
మునుగాల్చిన దహనుఁడు గా
ల్చెను గద ఘనముగను వారి చిత్తమునంతఁ. ౯౩.

ఉ॥ పాండవ నాశనంబువిని పారములేని ముదబ్ధిమగ్నుఁడై
యుండియుఁ గౌరవుండు వెలినూర్పుచు నశ్రులుగార్చుచుండె, మా
ర్తాండుని చే బహిర్జలను తాపమునొందియు శీతలంబు లో
నుండు హ్రదంబుమాడ్కిఁ నహో యని పౌరులు తల్లడిల్లఁగఁ ౯౪

క॥ బిలముఖము నుండి వెడలిన
బలిభీముఁడు మాతృభ్రాతృవర సహితుండై
బలసిన మదగజముంబలె
వెలసెను వనతలమునందు విగతభయుండై. ౯౫.

ఆ॥వె॥ అంసబాహు యుగళ మందున్న వారిని
గమనవేగ కారణమున విహ్వ
లాంగులగుచు సుప్తులగు పాండవుల నొక
కొలనువద్ద దించి కొలుచుచుండె. ౯౬.

కం॥ వనకంటకములఁ దొలఁగిం
పను భీముని జేచుపనికి వనదేవతయో
యననొప్పు రూపశాలిని
వనితయొకతె వాయుసుతుని వద్దకు వచ్చెఁ. ౯౭.

సీ॥ దంతకాంతిని నిశాతమమెల్ల విదళించి
భీముని సరసను భీతివదలి
నిలిచి వచించెను జెలువంపుఁబలుకుల
నీవెవండవు మఱి నిద్రనొంది

యిట పరుండిన ఘనులెవ్వ రీ దారుణ
విపినతలంబున విడియుకార
ణంబేమి యిచట హిడింబుడన్ గ్రవ్యాదుఁ
డుండును నరగంధ మూరఁగాంచి

తే॥గీ॥ వాని చెలియలు నగు నన్ను వాఁడు బంపెఁ
బట్టి తెమ్మని మిమ్ముల వచ్చినేను
నీదురూపముఁగని మెచ్చి నిలిచి యిటుల
మానవశరీరమునుఁ దాల్చినాను నిజము. ౯౮.

చ॥ మదనవికాసభాసుఁడగు మాధవుఁడల్లనవచ్చి కాననం
బదనునఁజేర వీరుధమునందు జనించును రాగపల్లవం
బదియెటు లట్టు మాధవుని యాకృతిఁగాంచిన నీవు కాననం
బు దయనుఁజేర నాకిదిగో పుట్టెను పల్లవరాగ మిత్తఱిన్ ౯౯.

క॥ దారుణ శరీరము న్విడి
యీరూపముదాల్చి యెలమి నిటు చేరితి నా
శారదఘని శాదము విడి
వారిధినిన్ గోరి చేరు వడువునఁ గనుమా. ౧౦౦.

ఉ॥ ఆ పురుషాదపుంగవుఁ డహంకృతి రోషణభీషణుండునై
దాపునవచ్చి పైఁబడును దాళితి మేనిట గాన నన్ను నీ
ప్రాపునఁజేర్తువేని నినుభర్తఁగనమ్ముచు నభ్రమార్గమం
దేపున నిన్నుఁగూడి యిపుడేగెద మేలొనఁగూడు మాకనన్ ౧౦౧.

కం॥ అవివాహ మంగఘుండయి
యువిదా! నా యగ్రజన్ముఁడుండఁగ నాకె
ట్లవును నినుఁదారఁజేయఁగ
నవుఁగద పరివేతృభావ మవనిని నాకున్. ౧౦౨.

క॥ విజనక్షితి నీతల్లిని
భజియింపక భ్రాతృవరుల భావింపక యీ
కుజనుని భయమునఁ బాటినఁ
ద్రిజగమున నన్నుఁ జూచి ధీరులు నగరే? ౧౦౩.

క॥ పరభయమున విక్లబుఁడౌ
పురుషుని నేతరుణియైనఁ బ్రోచెనె యెచటన్?
దురమునఁగను నీదు సహాయా
దరునెదిరిన భీముబలముఁ దన్వీ! యిపుడున్. ౧౦౪.

తే॥గీ॥ అగ్నికణములు వర్షించు నక్షియుగము
భీషణ భ్రుకుటులుగల భీకరాన
నంబు సృక్వములను లేహనంబుఁజేయు
రసనయును గల్గివచ్చెను రాక్షసుండు. ౧౦౫.

క॥ నరరక్తకాముకవు; ఛీ
నరకాముకివగుచు నుంట న్యాయమె? యోసీ!
ధరసేవు బహిష్కృతగా
నరుగుమ యని భగినిఁదిట్టి యనిలజుఁజూచెన్. ౧౦౬.

కం॥ వరియింపనేల యసురను
నరుత నియుద్ధమున నిలిచి యమరాంగనతో
స్మరకేళి జల్పుమా యని
గురుభీకరుఁడగుచుఁ దాఁకెఁగుదురుఁగ భీమున్. ౧౦౭.

తే॥గీ॥ ఆహావంబున జయకాంక్షులగుచు క్ష్వేళ
నాదమొనరింప వనమెల్ల నాదుగొనియె
గుంతిలేచెను కొడుకులఁగూడి; సింహ
గేహిని కిశోరములఁగూడి కెరలినటుల, ౧౦౮.

తే॥గీ॥ ఆకృతినిఁగొన్న జయలక్ష్మి యరుత నిలిచి
యున్నదో యన నొప్పిన యువిద నటుల
నసురు నెదిరించి యుద్ధమునందుఁ బోరు
పవనసూనునిఁగనిరి యాపాండుసుతులు. ౧౦౯

ఆ॥వె॥ కులిశపాతకఠినములగు ముష్టుల చేతఁ
బీవగోరు బాహుపీడనముల
నసురుఁగొట్టి చంపె ననిల సూనుం డాది
పురుషుఁడెలమి మధునిబోలె నపుడు. ౧౧౦

క॥ తెలతెలవాఱఁగ ఖగకుల
ములు దైత్యుని రక్తమాన ముదమంది కుజం
బులను ద్యజించెను దమ్ముల్
గొలిచిన నిద్రనుఁద్యజించెఁ గొమరారుచవిన్. ౧౧౧

కం॥ భానుఁడు భీముని మాడ్కిని
బూని తమోమయుని దానవునిఁదుంటలుగా
డాన మొనరించి లోకుల
మానసకమలములఁగూర్చె మహితముదంబున్. ౧౧౨

సీ॥ మదనార్తిఁగుందుచు ముదిత హిడింబి యా
యనిలసూనునిఁ గోరె ననుచు జనని
వినిచిన ధర్మజుఁ డనిలజుఁబిలిచి యీ
మధురరూపనుగొని మనువు నీవు
ప్రసవాంతముగుఁ దాక పొసఁగదిందే నింద
యని యొడంబఱిచిన నతిముదంబు
నొంది యాసుందరి పొందెను భీమునిఁ
గందర్పకేళినిఁ గాలమెఱిఁగి.

గీ॥ తావులను నొప్పు కానన స్థానములను
రత్నమయమగు చిత్రధరాధరముల
వలయుగతులను రమియించి రెలమివారు
మును పురూరవుఁ డూర్వశి నెనసి నటుల. ౧౧౩.

ఆ॥వె॥ శక్రశస్త్రపతన సహనమౌ వక్షంబుఁ
గల ఘటోత్కచుండు గలిగెవారి
కాదిహోత్రివలన నవనికి నరకాసు
రుండు పుట్టినటుల రోషమూర్తి. ౧౧౪.

కం॥ జనియించినపుడె యభివృ
ద్ధిని గన్నశరీరమటుల తీరినమీసల్
ఘనదంష్ట్రిలుగల సూనుఁడు
జనకునియానతిని జనియె జననీయుతుఁడై. ౧౧౫.

కం॥ భూసురుల వేసముంగొని
భాసురముగ వేత్రకీయ్య పట్టణమందున్
వాసముఁ జేసిరి పాండవు
లాసరసన్ దమకుబిక్ష మాధారముగన్. ౧౧౬.

కం॥ ఒకదిన మొక విప్రాంగన
వికలత దయితాంగమందు విన్నఁ బడుచుఁ బు
త్రకులఁ గని యశ్రులొలుకుచు
నకటా! యని యేడ్వఁ గుంతి యడిగెఁ గతంబున్. ౧౧౭.

క॥ అడిగిన నా విప్రాంగన
తడఁబడుచున్ బలికె సతిరో! దానవుఁడు బకుం
డడవిని నీప్రాంత్యంబున
గడు దుడుకులు చేయుచుండెఁ గద యిప్పురికిన్. ౧౧౮.

కం॥ చలమునఁ బట్టిఁ జనులను
బలిమిన్ బట్టుచును దినుచు బాధింపఁగ బె
ద్దలు వాని వేఁడికొనుచును
బలిగా నొక్కొకని దినముఁ బంపుచురుగదా. ౧౧౯.

కం॥ ఆ కట్టడ కనుమతుఁడగు
నా కట్టడి బకుఁడు జనుల నాహారముగాఁ
జేకొను దినమొకరుని హా!
యా కష్టదినంబుఁ బ్రాప్తమయె మాకిపుడున్. ౧౨౦.

ఆ॥ వె॥ భుజబలుండు దప్పఁబుడమి నా కుజనుని
పొడవునడఁప నగునె బొందితోడ?
విగతభాగధేయులగు మాకుఁగోణపు
భాగధేయులయెడి బ్రాప్తిఁగలిగె. ౧౨౧.

చం॥ తనయుఁడొకండు మాకుఁగులతంతువుగా మనియుండఁబోలదే?
తనయయొ యన్యవిత్తయగు దానినిఁ బంపఁగ రాదుగాదె? భ
ర్తను వదలంగలేనుభువి, దారను నన్ను విడంగనోపఁడీ
ఘనుఁడగుభర్త; చింతకును గారణమిద్దియుఁగాదె? కల్గరో! ౧౨౨.

కం॥ ఇతరుని విలువకుఁ గొనుటకు
గతిగానము విత్తమెచటఁ గావున తల్లీ!
వెతఁగుందు వారమనఁబృథ
కుతిలపడుచు నామెతోడఁ గొంకకపలికెన్. ౧౨౩.

క॥ బలియొకఁడు నాకుఁ బుత్త్రుఁడు
గలఁడమ్మా మాంత్రికుండు ఘనదానవులన్
గెలిచినవాఁడటు గావున
బలిగా నర్పింప వాఁడు బకునిన్ జెల్చున్. ౧౨౪.

కం॥ ఆదంపతుల రుదశ్రుల
కాదిని నుండకప్పురంబు నడచెదము" యిడియెన్
స్వాదుహిత వాక్యసరణిని
నాదేశవిధానవిధి దయామతి పృథ తాన్. ౧౬౬

క॥ ఆమాటలు విని దంపతు
లామోదమునంది పొగడి రతివిస్మయులై
భీముండు మాతృశాసన
మోముఁగ నుద్యుక్తుఁడయ్యె నుత్సాహమునన్ ౧౬౭

తం॥ ఘోరహిడింబ శరీరము
జీరిన భుజవిక్రమార్థ్యుఁ జేరుచు భ్రాతల్
భూరిగఁబొగడిరి పౌరులు
వారక యిడసాగి రన్న పానాదులునున్. ౧౬౮

తే॥గీ॥ రక్తమాల్యాంగరాగ వస్త్రములతోడఁ
బౌర నయనోత్సవంబుగఁ బవనపుత్రుఁ
డోదనాదులతో నిండి యుక్తధుర్య
ములునుగల బండినెక్కుచుఁ బోయె వనికి. ౧౬౯

ఆ॥వె॥ నరకరంకరాశి గిరులఁ బోలుచునుండు
కంక కాక జంబుకములు వ్రాలు
ఝిల్లికారవంబు ఝుల్లని మోగెడు
వనము జేరెఁ బవన తనయుఁడపుడు. ౧౭౦

కం॥ అదానవు శవమంటిన
మీదట భుజియింపనగు నె మృష్టాన్నంబుల్?
గాదన కిపుడేఁ దినియెద
నోదనమని కుడువసాగె నుత్సాహమునన్. ౧౭౧

కం॥ అశనముఁ దినుచు న్భీముఁడు
దిశలెల్లను నద్రువఁబండ్లు దీటుచునార్చెన్
పిశితాశనుఁడవ్వు డాగ్రహా
వశుఁడై గిరి గుహాను వెడలి వచ్చెను గినుకన్. ౧౩౨.

కం॥ కినిసిన దనుజుఁడు ముష్టిని
ననిలజు పార్శ్వములఁ గొట్ట నన్నకబళముల్
జనె నోకొ్కకటిగ జారుచు
గనె నుదరస్థాన మయుతగజసత్త్వనెడన్ ౧౩౩.

కం॥ అంతికమున దానవుఁగని
యింతైనను భయములేక యితరాన్నమునున్
సంతసమునఁదినె; సింహాము
చెంత సృగాలమునుఁ జూచి చెందునె భీతిన్? ౧౩౪.

కం॥ బలినంతయు భుజియింపుము
చలనమువలదోరి! యెచటఁజనునది? నీలో
నిలుచును! నిను నేమ్రింగిన
బలియు న్ననుఁ జేరుఁగాదె పరిపూర్ణముగన్? ౧౩౫.

కం॥ ఆమానవాము మాటలు
భీముఁడు విని యార్చెనగుచు విగతభయుండై
యేమనక మిగతబలిఁదిని
నేమంబున నుదరమంత నిమురుచుఁ బలికెన్ ౧౩౬.

ఉ॥ ఓరి! నృశంస! మానవవధోర్జితశౌర్యము నీవసుంధరన్
భూరిగఁగల్గు నీకనుచు భూజనులాడఁగవిన్న, నిన్ననేఁ
జేరఁగవచ్చి నాడ నిదిసిద్ధము విక్రముఁడైతివేని నీ
ఘోరత నీ హిడింబక నిఘానను ముందటఁజూపుమంచనన్ ౧౩౭

కం॥ ఆమాటలు విని యోపక
యామానవవైరి సాలచుట్టైతివిచి యా
భీమునిపైఁ ద్రోయఁగ నది
సామీరికరంబునందు సాయకమయ్యెన్. ౧౩౮.

ఉ॥ తాల తమాల సాలక వితానమునంతయు వ్యర్థమయ్యె నా
భీల తమోపలంబులును వీడ్వడెఁ బోరున దానవుండు దా
సోలుచు ద్వంద్వయుద్ధమున సొంపఁజెడియుండుటఁ జూచి భీముఁడా
రోఘుని కాళ్లువట్టి వడిగూల్చెను ద్రిప్పఁచు వైచె భూస్థలిన్. ౧౩౯.

కం॥ గళపీడనచేఁ జచ్చిన
ఖలుని న్వడిఁ బట్టి యీడ్చి గ్రామాంతికమా
తలమునవిడె, మృగమును హరి
చలమున గుహఁ జేర్చునట్టి చందంబునను న్. ౧౪౦.

కం॥ వచ్చిన భీమునకును ద్విజు
లిచ్చిరి దీవెనలు కౌఁగిలిచ్చెను బృథయున్
మెచ్చిరి భ్రాతలు, ఖేచరు
లచ్చెరు వందుచును జూచి రాసత్వాఢ్యున్. ౧౪౧.

ఆ॥వె॥ వజ్రపాతమునకుఁ బడినపర్వతమును
బోలిపడిన కుణపభోజనుఁగని
భయము ముదమునంది భాగ్యమద్భుతమని
పురజనంబు పొగడెఁ బురుషవరుని. ౧౪౨.

కం॥ దానవనాశన కతమున
మానవులాపురిని స్వేచ్ఛమనిరి ముదమునన్
కాననఁగల వ్యాఘ్రమునాశన
మైనన్ మృగకులము ముదము నంది మనుగతిన్. ౧౪౩.

ఆ॥వె॥ యజ్ఞసేన సుతకు నగు స్వయంవరమని
పథికులాడు వార్త పాండుసుతులు
వినుచు నచటికేగు వేడుక మదిఁబుట్ట
వేత్రకీయ్య పురము వెడలి రపుడు. ౧౪౪.

ఆ॥వె॥ వ్యస్తవిశ్వనిగముఁడగు తపోధనుఁడును
భారతంబుఁజేసి భూరికీర్తి
నందినట్టి కవియు నధ్వంబునందునఁ
బాండుసుతులఁ జూచి పలికెఁగూర్మి. ౧౪౫.

సీ॥ జతుగృహంబుననుండి చావుకుఁదప్పితి
రని గురు ముఖమున వినుచుఁ బార్ష
దుండు దానిప్పుడు దుహితస్వయంవర
మని చాట మీరట కరగు డెంచి
యాస్వయంవరఫల మనుభవింతురటంచు
లబ్ధనిశ్చయుఁడయి లాలితముగ
నుత్సవ మొనరించుచున్న వాఁడటుగాన
మార్గశ్రమను మీరు మఱచి రేలుఁ

గీ॥ బవలుఁబయనంబు సలుపుచుఁబట్టణంబు
జేరి దవధూమయోనిజఁజెలువఁగన్య
కావతంసనుఁ జేపట్టి యలరుఁడిప్పు
డనుచుఁ బలుకుచుఁబోయె నా యతివరుండు. ౧౪౬.

తే॥గీ॥ అర్జున కరోల్కకార్చిని నంధకార
మణఁగి యధ్వము గనిపింప నరిగి జాహ్న
వీతటంబునుఁ జేరిరి వీతభీతిఁ
బాండవేయులు గుంతితోఁ బయనమగుచు ౧౪౭.

తే॥గీ॥ చానలసుఁ గూడి జలకేళి సల్పు చిత్ర
రథుని క్రొవ్వును రథమును రణమునందు
నర్జునుఁడు గాల్ప హతబలుఁడగుచు వాఁడు
బద్ధసఖుఁడయ్యె వారికి భద్రముగను. ౧౪౮.

క॥ పిదపన్ బయనంబున నొక
యుదాత్త మహనీయు ధౌమ్యు నురుధర్మ విదున్
గుదురుగ గురునిఁగఁ జేకొని
పదపడి వడిఁ జనిరి ద్రుపదపట్టణమునకున్. ౧౪౯.

క॥ కురువరులు కులాలకమం
దిరమునఁ దమతల్లినుంచి ద్విజవేషమునన్
వర కనకమంచికల భూ
వరులుండెడి రాజసభకు వచ్చిరి వేడ్కన్. ౧౫౦.

ఆ॥వె॥ నృపతితనయన భృంగ నీలాబ్జమాలయై
జెలులఁ గూడియున్న చెలువఁ జూచి
పాండవేయు లొకట పరిఁబంచబాణుని
బాణపంచకమునఁ బడిరి బాధ. ౧౫౧.

సీ॥ అంతధృష్టద్యుమ్నుఁ డాస్వయంవరగృహ
మున నిల్చి యవనీశులను గుఱించి
దుర్నమచాపంబు, ద్యోమార్గమున వ్రేలి
యంత్రాంతరంబున నటులయిటుల
చలియించు లక్ష్యంబు, సాయకంబునుఁ జూపి
పలికె భూవరులనుఁ బాఱఁజూచి
యీ ధను వెత్తుచు నీసాయకంబున
గగనలోల శరవ్య మగల భువినిఁ

గీ॥ బడఁగనేసిన నృపతి తాఁ బడయు నాదు
సోదరినిఁగాన నృపకుల సోములార
మీబలంబును నిప్పుడు మీఁదుపెట్టి
కఖిలమునుఁజూపి తత్పుల మందుఁడీరు. ౧౫౭

—* ఓం *—

# తృతీయాశ్వాసము.

క॥ అనిపలికి చెల్లెలిం గని
వినుమా యిటఁ గూడినట్టి వీరవరుల నీ
జనపాలుర చరితంబును
వినిచెద సకలంబు నీకు వినవలతేనిన్. ౧.

మ॥ కనుమా కట్టెదుటన్ గనంబడెడి భూకాంతుండు దుర్యోధనుం
డను వాఁడీతని భాగ్యమున్ననుచు విత్తాధీశుఁడత్యల్పుఁడే
నని లజ్జించి యుదీచియం దెచటనో యాశాంతమం దున్నవాఁ
డనయంబీ యభిమానమూర్తికను నత్యాభోగసామ్రాజ్యముల్. ౨.

ఉ॥ మౌళి నిరూఢ రత్నమణిమానితులై వసుధాధురీణులై
గ్రాలుచు వాని పార్శ్వమునఁ గామిని! కానవె యున్నవారు, నా
గాళి యనంతపార్శ్వయుతమైన తెఱంగున, వానిసోదరుల్
మేలగు భూషణాదులను మేనునఁబూనినవారు సుందరుల్, ౩.

తే॥గీ॥ అక్షవిద్యను శౌండుఁడన్ ఖ్యాతిఁగనిన
శకుని గాంధారనాథుని సరసఁగనుమ
అదిగో! యాచార్యపుత్రుఁడు విదితయశుఁడు
శౌర్యమందుఁ బినాకికిసముఁడు గనవె ౪.

తే॥గీ॥ సహజకవచ శరీరుండు సత్త్వశాలి
యవని బాలార్కతుల్యుఁడా యంగవిభుఁడు
వాసికెక్కిన జీమూతవాహ శిబి ధ
ధీచులను మించు దాతకాఁడే యతండు? ౫.

కం॥ హాలమును గైకొని యిరుపా
యలుగా విభజించెననుచు యమున కసలి తా
వలగొని చుట్టెనోయిన దు
వ్వలువలు గల హాలిని శ్వేతవర్ణునిఁ గనుమా. ౬.

కం॥ ఎవఁడాసుర వృక్షముఁ గొన
దివి శచి, నందనముబలెను, దీనతఁగనె నా
యుపకార పురుషుఁడితఁడో
యువిదా! యదువంశమందు నుద్భవమయ్యెన్. ౭.

తే॥గీ॥ పుష్పసాయకజనన సంపూజ్యమైన
యదుకులంబున భోజవృష్ణ్యంధకాది
తతిని వెలిగెడు గనుము సాత్యకియతండు
చంద్రుఁ డుడురాజిభాసిల్లు చందముననుం. ౮.

తే॥గీ॥ పదియునెనిమిది మారులు పరిభవించె
హరిని పేఁడని శూరగుణానురక్త
యగు రమాదేవి, యభిముఖియయ్యె నెవని
కా జరాసంధుఁ డితఁడమ్మ యతివ! కనుమా. ౯.

తే॥గీ॥ ఇతఁడు ప్రాగ్జ్యోతిషపురంబు నేలురాజు
రణమునందున నితని వారణము రిపుల
యాననాంబుజ వనమున యత్నముగను
డెంచుఁగద పిసిఁగాంచవే తెలివసీవు. ౧౦.

కం॥ చేదీశుఁడు శిశుపాలుఁడు
యాదవకులమణిని దృణముగాఁ గనునమ్మా
యీదొడ్డరాజుఁ గాంచుము
యాదరువని మద్రపతితని నర్చింతురిలన్. ౧౧.

కం॥ ఆహవమున రిపురాజుల
బాహాటోపంబు నేప బర్హిర్ముఖుఁడీ
మాహిష్మతీశు నీలుని
సాహాయ్యుఁడుగాఁ జరించు సతిరో! కనుమా. ౧౨.

మ॥ అతివా! యీధరణీశులుం గ్రమఱి ననేకాన్యావనీశుల్ ఘనుల్
సతతోత్సాహమతిన్ ద్వదర్థమిటు నీసామీప్యముం జేరి రీ
క్షితినాథాళిని నెవ్వఁడేనియును లక్ష్యేభూతలక్ష్యంబు స
జ్జితచాపంబున వేయఁజాలు నతనిన్ జేకొమ్ము నీభర్తగన్ ౧౨

కం॥ కనకాసనోప విష్టులు
ధను వెత్త న్వత్తరించు ధరణీపతు లా
యెను నా పాలీకన్నక
యనుచుం మొదలేను జనెద ననసాగిరటన్. ౧౩

క॥ ధరణీసుర మధ్యస్థిత
గురుధీరులఁ బాండుసుతుల గోపాలుఁడు స్తో
దరునకుఁ జూపుచు యాదవ
వరులను ధను వెత్త నరుగవలచని పలికెన్. ౧౪

క॥ గిరిరాజ సారమగు నా
శరాసనము గొంద ఱెత్తఁ జాలక చని రా
ధరణిపులు గొంద ఱెత్తియు
దరలిరి యెక్కిడఁగ శక్తి తగ్గిన వెతతోన్. ౧౫

తే॥గీ॥ మాషమాత్రము నెక్కిడి మహిని బడియె
జాపయుతుఁడయి నీలుఁడు; శల్యుఁడంత
ముద్గమాత్రంబు నెక్కిడి ముప్పుఁ జెందె
మాగధుండిట్టె సర్షపమాత్ర మంత. ౧౬

కం॥ గురుతర శరాసనము భా
స్కరసూనుఁడు పూని సజ్యకర్మము లోమా
తర మొనరిచి పడవైచెను
కరి మత్తిలి మావటీని గడఁద్రోయుగతిన్ ౧౭

కం॥ ఈగతి విఫలమనోరథు
లై గాసిలి కౌరవాను లడల ద్విజాళిన్
నాగేంద్ర హస్తుఁడర్జునుఁ
డా గమిలోనుండి లేచె నయుతబలుండై ౧౮.

కం॥ ధరణీసుర వర్గము మది
హరుషము జెందుచును సుండ నర్జునుఁడుశరం
బరిబోసి వేయ లక్ష్యము
ధరఁబడె నభిమానమూడె ధరణీశులకున్. ౧౯.

తే॥గీ॥ ధరను విలుబూని పుట్టిన మరునిఁబోలు
నరునిపై దివ్య వృష్టియుఁగురియుచుండ
స్తోత్రపాత్రములౌ రాజపుత్రి నేత్ర
కమలములు వానియంగముఁగలయఁగప్పె. ౨౦.

కం॥ పిదపన్ దతలాంతంబున
ముదమున కల్హారమాల ముదితయిడఁగ నా
త్రిదశేంద్ర సుతుఁడు గైరిక
గదిసిన యంజననగంబుగతి భాసిల్లెన్ ౨౧.

కం॥ నరనాయకుల నికాయము
నిరసించుచు శౌల్కచాప నిరుపమ బలిమై
కరిగమనను దోడ్కొని మం
దిరమునకు న్వెడలె నరుఁడు ధీరుఁడుగానన్ ౨౨.

కం॥ నరపతులకు నవమతిగను
తరుణిని విప్రునకునిచ్చె ధరణీశుఁడటం
చురు రోష భాషలాడెడి
నరనాథుల కెదుటఁ జనియె నరుఁ డుదారన్. ౨౩.

ఆ॥ వె॥ దంతధారలగుచు ధరణీసురులు లేచి
గర్వయుక్తులైన ఖలనికాయ
మడఁచు మనుచుఁ బలుక నర్జునుఁ డాధరా
మరుల వలదటంచు మరలఁబనిచె. ౨౪.

కం॥ నరుఁడా రవిసుతుని వ్రకో
దరుఁడా దుర్మ్యనుని శల్యు డాఁకుచు నాజిం
చిరి యశము రాజులందఱు
సురలంబలెఁ దద్విధమ్ముఁ జూచుకతమునన్. ౨౫.

ఉ॥ భీముఁడు ద్వంద్వయుద్ధమున భీకరుశల్యునిఁ బట్టి యెత్తి వే
భూమిఁబడంగఁ ద్రోసి మఱి భూతదయాపరుఁ డార్తబంధుడున్
ప్రేమను జేసి మాతులుని వీడెనుచంపక కానవాఁడసు
శ్రీమహితుండునై యశముఁ జెందె నిలాతలమందుఁ జెన్నుగన్. ౨౬.

ఆ॥ వె॥ విప్రుఁడనుచు మృదుల విశిఖము లేసిన
కర్ణు నర్జునుండు గాడనేసె
రవిజుఁడప్పుడు మరలె నవనీసురుని తేజ
మగునె గెలువ ననుచు నాజి వదలి. ౨౭.

కం॥ అటుకర్ణశల్యు లోడుట
కుటిలాన్యధరాధిపతులు గుందుచు కనుచున్
బటుకోప విస్మయంబులు
నటులజ్జయుఁగూడి పురుల కరిగిరి వేగన్. ౨౮.

సీ॥ దివసావసానంబు దీపింపఁబాండవు
లా ద్రౌపదినిగొని యరిగి కుంభ
కారుని యిలు సేరి ద్వారమందున నిల్చి
యంబను జేరి యోయమ్మ! మంచి

ఫలభిక్ష మిదిగో సంపాదించి తెచ్చితి
మన్న మాటలు లోన నున్న. తల్లి
విని ప్రౌఢరసఫల మనుభవించుడి మీర
లందఱుంచని పల్కి యంతలోన

నిల్లు వెలివచ్చి నిలచిన యింతిఁ జూచి
ధర్మభీతిని లజ్జను దాల్చియుండ
ధర్మజుండది కనుఁగొని తల్లి! నీదు
పలుకు వృథయగునే యని పలికె నిటులఁ. ౨౯

కం॥ అమ్మా! మేమందఱ మీ
కొమ్మను గనినంత ననలకోరి చిలుకులన్
జిమ్మినకతమున నాయమ
యిమ్మగువను మేముగొనుట. యిదిధర్మంబా. ౩౦

కం॥ తనయల్లుని శరకౌశల
మునుగని క్షత్రియుఁడటంచు ముదమంది నిజ
మ్మునుగన ద్రుపదుఁడు వానిని
వినయముగాఁ బిలువఁ బనిచె విహితవివేకున్. ౩౧

చం॥ పిలిచిన ధర్మజాదులును ప్రీతినివచ్చి సమంచితాసనం
బుల సుపవిష్టులైనతఱి భూపతి వారి కులాహ్వయంబులన్
దెలియఁగఁగోరె ధర్మజుఁడు తెల్పెను మృత్యుముఖంబునుండి వే
వెలివడినట్టి పాండవులు వేఱెవ రేమియటంచుఁ ప్రేముడిన్ ౩౨

తే॥గీ॥ సర్వసత్కృత్యములు సేసి సంతసించి
పలికెఁ బృషదాత్మజుండిటు పాడిమెరయ
నెవని బాహుబలంబున కింతి లబ్ధ
మయ్యె నావీరు డాకన్య నందుఁగాత. ౩౩

కం॥ అనిపలుక ధర్మజుం డది
కని వినిచెను భ్రాతృపంచకంబునకా నూ
తనరత్నమయంబగు మా
నిని సతియయి యుండవలదె నిత్యోత్సుకమై. ౩౪.

కం॥ అనిపలుకు తఱిని మహిమల
ముని వ్యాసుఁడువచ్చి ద్రుపదు మ్రోలనిలిచి యో
జనవర! వరపంచకమా
వనితకుఁదగు సందియంబు వలదిఁక మదిలోన్. ౩౫.

చం॥ అనుచును కృష్ణరాఁబనిచి యామని పంచపతీత్వగాథఁదా
వినుప నుపక్రమించె నృపవీరునకున్ విను ధారణీశ! యీ
వనజదళాయతాక్షి వరవర్ణిని పుణ్యచరిత్ర మంతయున్
వినిచెద నీదు వీనులకు విందుగ సందియ మంద నేటికిన్. ౩౬.

తే॥గీ॥ కుష్ఠరోగిని శతవృద్ధుఁ గోపయుతుని
బతిని మౌద్గల్యు నీసాధ్వి భక్తిఁగొలిచి
పూర్వజన్మంబునందు నపూర్వమహిమ
నలరె నారాయణీయను నాహ్వయమున. ౩౭.

చం॥ తరుణిపతివ్రతాత్వమును దా నరయంగ విరూపధారియౌ
పరమతపోధనుండు చెలిబాధలెఱుంగుచు నింగితజ్ఞుఁడై
స్మరసమరూప పంచకము సంఘటిలన్ ధరియించి దారచే
నురుతరభోగసంపద లనూనముగాఁగనియుండెఁ బ్రీతిగన్ ౩౮.

తే॥గీ॥ ముని తపోవిఘ్నభయమున ముదితఁగాంచి
తుచ్ఛసుఖముల నేనిఁక నిచ్ఛయింప
నతిరో! యని యొక్కమంత్రంబు సదయుఁడగుచుఁ
దరుణికిని దెల్పి చనెఁగదా తబసిమిన్న. ౩౯.

సీ॥ ఇంద్రసేనయనంగ నింతి నామముదాల్చి
యుగ్రతపంబును నుగ్రుఁగూర్చి
చేయఁదొడంగెను చిత్తంబు శంకరా
యత్తమౌ రీతిని నధికభక్తి.
ఉత్తంసితార్ధ చంద్రోత్తమాంగ ప్రభా
క్రాంత కర్బుర కంఠకాంతి కలితుఁ
డీశ్వరుఁ డాయింతి యీప్సితంబొనఁగూర్ప
నేతెంచి చాలునో యింతి! తపము

నేవరంబును గోర నిచ్చెదనని తెల్ప
నతివ “పతిం దేహి.” యనుచు నైదు

తే॥గీ॥ మారులనఁ బ్రీతుఁడై మారమారకుండు
అతికరుణఁబలికె నవదాతవృత్త! యస్య
భవమునను నీకుఁ బ్రఖ్యాత పంచపతులు
గలుగుదురు గాత మని మఱిఁబలికె నిటులఁ. ౮౦

కం॥ వనితా! గాంగతటంబున
కును జన నందొకయువునిఁ గోమలరూపుఁ
గనుదువు వానిని నిటఁదో
డ్కొనిరమ్మని పనుపఁజనియెఁ గోమలియటకున్. ౮౧

కం॥ గగనాపగావగాహము
మగువయొనర్చుచును వగలు మదిఁగలఁపఁగఁ జాఁ
బొగలుచు బాష్పకణంబుల
జిగిబంగరు జలజముల సృజించుచు నుండన్ ౮౨

మ॥ అమరేశుండు యదృచ్ఛ దారిఁ జనుచో నాయింతినింజూచి వే
గమ చేరంజని యన్వయాఖ్యలును శోకంబందగా హేతువుల్
గమలాక్షీ! యెఱిఁగింపవే? యనుచు వేడ్క న్వేఁడ నయ్యింతి యా
క్రమమెల్లన్ వలతేని సర్వము వినంగాఁ దెల్పెదన్ రమ్మనన్. ౮౩.

తే॥గీ॥ లోలహృదయుండు నగుచు విలోలనేత్ర
వెంటఁ జనుతఱి నొకమచ్చెకంటిఁగూడి
కాంచనాద్రిని సుందరకాయుఁడొకఁడు
పాచికల నాడుచుండ సుపర్వవిభుఁడు. ౮౪.

చం॥ సుమనసనాథుఁడైన నను జూడక లేవక మ్రొక్కకెవ్వఁడీ
క్రమమున నన్నమానుషముగన్ గనుచుండు ఖలుండటంచుఁ గో
పమున వచింప నీశ్వరుఁడు పారఁగఁ గంతముద్రిప్పి చూచె నా
సమయమునన్ సురేశ్వరుఁడు స్తంభము రీతిని స్తబ్ధతన్ గనెన్ ౮౫.

కం॥ సురనాథుని కరగతమగు
వర వజ్రము క్రిందఁ జాఱె వరయానను లా
సురనాథులు మఱినల్వురు
గిరిగుహ వెలివెడలి వచ్చి గిరిశుని యెదుటన్. ౮౬.

చం॥ నిలిచినఁ జూచి భీతిలుచు నిర్జరనాథుఁడు కేలు మోడ్చి యో
కలుషవినాశ! యీశ! హర! గర్వమతిన్ గనుగాన కేనిటుల్
పలికితిఁ దప్పు దాసుఁడను సాగిల మ్రొక్కెద నీకుఁ గావవే
యలికవిలోచనా! క్షమకు నర్హుఁడ నేనని వేఁడ సాగినన్. ౮౭.

తే॥గీ॥ శంకరుఁడు సాదరతఁ బలికె శక్ర! నీవు
వీరు నలువురు నినుఁ బోలు వీరవరులు
వసుధ మనుజులుగా నుద్భవంబునంది
కొనుఁడి ద్రౌపదిగ నియ్యింతి ననుచుఁ జనియె. ౮౮.

కం॥ కన యమ పవమానేంద్రా
శ్వినులేవురు వారు భువిని వీరయి జన్మిం
చినవారు భవత్సుత యా
వనితామణి యయ్యె సుకృతదశమునఁ గనుమా. ౪౯

కం॥ అని పలికి దివ్యలోచన
మును నృపతి కనుగ్రహించె ముని ద్రుపదుండున్
గనుగొనెఁ బంచసురేశుల
ఘనుఁను వారి పార్శ్వగతయగు సతినిన్. ౫౦

తే॥గీ॥ విస్మయానంద మయుఁడయి విశ్వనేత
యాజ్ఞ యిదియని మదినెంచి యవనిపతియుఁ
బంచపాండవులకుఁ గృష్ణఁబరిణయమ్ము
సేయ సమ్మతిఁ దెలిపెను శీఘ్రముగను. ౫౧

తే॥గీ॥ తనపురోహితుచే నర్హ ధాన్యవస్తు
వితతిఁ బొందింపఁ బడినట్టి వేదిఁజేరె
ధర్మజుఁడు మామ కేలూతఁదనరఁగొనుచు
మణిమయంబగు సోపానమార్గమునను. ౫౨

కం॥ తనమొదలి కాంతి తొడవుల
కును దొడవగుచున్న కృష్ణఁగులపాలిక ల
ల్లనఁ గొని చని కనకాసన
మునఁ జేర్చిరి వరునిపార్శ్వమున సంప్రీతిన్. ౫౩

తే॥గీ॥ భృంగ సంగతి రంజిల్లు చెంగలువల
సోకి హంసము చెలిఁగూడి చుట్టురీతి
ధౌమ్యకృతహుతభూమాగ్ని ధర్మజుండు
ద్రౌపదినిఁ గూడి సలిపెఁ బ్రదక్షిణమ్ము. ౫౪

చం|| పవనుని ప్రేరణంబున నపాంపతి వీచిక లల్లఁ బారలన్
దవిలి ప్రవాళజాలమును దార్చిన రీతిని ధౌమ్యునానతిన్
గువలయ పత్రనేత్ర సుమకోమలి పల్లవహస్త కృష్ణ సం
స్తవము నొనర్చి లాజలును దార్చెఁగృశానవునందు భక్తితోన్. ౫౫.

మ|| పరభూపాలనితంబినీతతి శిరోభాగంబునన్ గ్రాలు ప్ర
స్తరకాఠిన్య విశిష్టరత్నముల నాతన్వంగి మెట్టంగ నే
ర్పరిసన్ జేయఁగ మున్నెపూనియొకొ యా పాదంబులన్ బట్టుచున్
నరనాథుం డుపలంబుపై నడపె నానందంబునన్ గృష్ణనున్. ౫౬.

తే||గీ|| ఘర్మజల శీకరార్ద్రము కమ్రపుష్క
రాభమగు కృష్ణకరమును నాగమొక్త
భంగి భీమార్జునాదులు పట్టి రెలమిఁ
గరిణిఁ గరినాథులంబలె గరముదముగ. ౫౭.

కం|| మంగళ నీరాజనము లొ
సంగంబడె ద్రుపదుఁడంత సంతసమున మా
తంగ తురంగ రథాంగము
లంగుగ ధనరాశి నిచ్చె నల్లురకెల్లన్. ౫౮.

కం|| పరిణయ వార్తలు విని యా
కురురాజు విషణ్ణుఁడగుచు గురుబలయుతుఁడై
త్వరితగతి ద్రుపద పురమునుఁ
బరిగొనెఁ బాండువుల ప్రాణభంగోత్సవుఁడై|| ౫౯.

కం|| అలకర్ణ శకునులను దం
డ్రష్టల దుర్యోధన విషాను సంగతిగల యా
బలనాగ మర్జునాళుగ
కలితంబగు మంత్ర మహిమఁగలగుండువడెన్. ౬౦.

చం॥ ద్విరదముఖుండు సాయపడ ధీరుఁడు సరంధుఁడు క్రూరుఁడౌ గజా
సురుని వధించినట్లు రణశూరుని భీమునిఁ గూడి యర్జునుం
డరిబలమంతటిఁ గూల్పఁ గని యంగనృపాల పురోగముండునై
కురుపతి యా పురోచనునిఁ గూడఁగనాడుచుఁ బాపె ఖిన్నతన్. ౬౧

ఆ॥వె॥ పార్థులిటుల ద్రుపదు పట్టణంబున నుండ
వారిసరసఁ జేరె శౌరి కరుణ
వెలసి రపుడు వారు జ్వలనుని సన్నిధి
జ్వాలలటుల కాంతి సారులగుచు. ౬౨

ఆ॥వె॥ అంబికేయుఁడంత నాత్మ తనూజుని
దుర్విచారమెల్లఁ దొలఁగఁజేసి
పాండుసుతుల కర్థభాగ రాజ్య మొసంగ
దలఁచి పనిచె వారిఁ బిలువ విదురు. ౬౩

కం॥ విదురుని వెంబడి పార్థులు
ముదమునరాఁ గౌరవాది మూఢులు చింతన్
బొదలుచు నుండఁ దదన్యులు
హృదయానందముగఁ గనిరి హెచ్చిన ప్రీతిన్. ౬౪

తే॥గీ॥ సచివవృద్ధులు శుభదివసమున రాజ్య
మునకుఁ బట్టంబుగట్టు సమ్మోద మెసఁగ
యమతనూజునిఁ బూర్ణకుంభమును మండ
పమునఁ జేర్చిరి జనులెల్లఁ బ్రస్తుతింప ౬౫

సీ॥ ఔదంబరోచిత మగు భద్రపీఠము నను బాండవాగ్రణి నునిచి నపుడె
యంతటనిండె నాయభిషేకశంఖాభిరావంబు లటుల పౌరంధ్రి భద్ర
గీతనాదంబులు నాతఱిఁ దపనీయ కుంభస్థమగు కుశాంకూరమూల
క్రమున మంత్రపవిత్రవిమల జలంబులు ధౌమ్యాదిభూసురుల్ ధరణినేత

తే॥గీ॥ పైన నభిషేక మొనరింపఁ బతిశిరంబు
నుండి జలధార దిగజాఱు చుండు విధము
చెలఁగె నుదయాద్రి పై విరాజిల్లు తామ్ర
పూర్ణహిమధాము కిరణము లొప్పురీతి, ౬౬.

కం॥ గురు రత్నాలంకృతుఁడయి
ధరణీశుఁడు రాజ్యపీఠతలమెక్కఁగ సా
గరమేఖలోర్వి తద్వరు
వరవామభుజంబు నెక్కి వర్ధిల్లెఁగదా? ౬౭.

తే॥గీ॥ కాంతలెల్లరు కర్పూరఖండములను
రత్నపాత్రల నునిచి రారాత్రికముల
వెలుఁగఁజేయఁగఁ దద్దీపకళికలొప్పె
ధర్మజాధిక దర్పసంతతి యనంగ, ౬౮.

కం॥ ప్రతికర్మరమ్యమయి సుమ
వితతిని విలసిల్లు పురము వేడ్కఁగనుచు నా
క్షితిపతి రాజిలెఁ దారా
పతి సత్తతి పథమునందు భాసిలుమాడ్కిన్, ౬౯.

చం॥ కరితతి కుంభహస్తములు కాంతల దివ్యకుచారుకాంతిచే
బరిభవమంద భీతి నవి వంగెను వానిని భానులెక్కి భూ
ధరుఁగను వేడ్క నప్పురము దారిని బోవు విలాసమొప్పె మే
దురఘనలక్ష్య శంపలని తోఁచు విధమ్మున నవ్యవైఖరిన్, ౭౦.

తే॥గీ॥ పతినిఁ జూచెడి రక్తి నిష్పందపక్ష్మ
లోచనాన్విత సుందరీలోక మొప్పె
నలశరత్కాల సరసున హంసఁగాంచు
ననిలహతిలేని నళినాళి ననుకరించి, ౭౧.

చం॥ ఒకతఱి సాంబికేయు హితమూని సఖుండగు శౌరిఁజేరి సే
వకులను దమ్ములన్ గలిసి వచ్చె యుధిష్ఠిరుఁ డాయురాదినా
యకు లెట మున్ను నిల్చిరి విహారముఁగోరుచు నట్టి సౌఖ్యదా
యకమగు ఖాండవంబను మహా గిరిరాజముఁగూర్చి ప్రీతిమై ౭౨

కం॥ ఉనికికిఁదగు గృహముచ్చటఁ
గనక యుధిష్ఠిరుఁడు చింతఁగన, శౌరి మనం
బునఁదలఁచె నింద్రు నతఁడం
పెను త్వష్టను వచ్చె నతఁడు ప్రియమున వనికిన్. ౭౩

ఉ॥ వచ్చి మురారికిన్ మిగుల వందనము ల్పచరించి పల్కెనో
సచ్చరితా! పురంబొకటి శక్రుని నామమునన్ సృజింపవా
క్రుచ్చెను వాసవుం డటని కోరిక మీఱ నపూర్వపట్టణం
బిచ్చట నీయుధిష్ఠిరు నభీష్టము రీతిని గట్టఁ బూనెదన్. ౭౪

కం॥ అనిపలికి శౌరియానతిఁ
గొని యింద్రప్రస్థమనుచుఁ గొనియాడెడి ప
త్తన మొకటి హేమ మణిమయ
ఘనమై యలరారు దానిఁ గల్పించె వెసన్. ౭౫

ఉ॥ సంతసమంది యొక్క యభిజాత దినంబు నజాతశత్రుఁడా
శాంతయశోవిశాలుఁడు మదావళమెక్కి సతూర్యనిస్వనా
క్రాంత విరాజమానమగు రాజపథంబునఁ జేరె భూసురా
నంత విధాగమోక్తుల శుభావహమైన నవీనగేహమున్. ౭౬

తే॥గీ స్నిగ్ధ వర్ణాధికతయుఁ బ్రసిద్ధమైన
ప్రకృతియునుఁ జెల్వమును గల్గి భవ్యనూత
నోపచారములన్ బురి ద్రౌపది బలె
నందమైయుండ నధిపుఁడానంద మొందె. ౭౭

కం॥ ఆలోకన కౌతుకమున
నాలోక విభుండు సౌధ మారోహింపన్
మేలెంచి త్వష్ట వినిచెను
నాలోకోత్తర పురీమహామహిమంబుల్. ౭౮.

కం॥ అరయఁగ నీ దోరర్గళ
పరిగుప్తం బగుచు వెలయు పట్టణ మిదె యా
సురపురము నిజపతాకా
కరమున నిరసించుచుండుఁ గంటే నృపతీ! ౭౯.

తే॥గీ॥ హరిమణుల తీరముల కాంతి సరసులందు
ననల కెల్లను వ్యాపించి నల్లకలువ
లంబలెసఁగఁ జేయ నచటి రోలంబ గణము
కుసుమ భేదము నెఱుఁగు మూర్కొనుచువాని. ౮౦.

ఉ॥ లోలవిలోచనా వినుత లోచనభూషితమై పులోమజి
న్నీలమణీడితంబునయి నిర్మలమైన గవాక్షజాలమో
భూలలనాభుజంగ! సరిపోల్చఁగఁ గళిందజయందు నున్నలో
లాలితమైన మీలగుమిలాగునఁ గన్గొనుమా యరిందమా! ౮౧.

మ॥ కనుమా యిప్పురి సౌధనూతన పతాకాశాటికా మారుతం
బునకుఙ్ విష్ణుపదార్వ్యమాశ్వతతి యుబ్బుందకెం నానాధ్వముల్
గనుచుఙ్ బో వివిధోరురత్నరుచి యోగంబంది య య్యుగ్యముల్
గనె నానావిధ వర్ణయోగముల భూకాంతా! కనఙ్ జిత్రమా. ౮౨.

కం॥ సుందరవదనలు మేడల
యందాడుచుఁ జంద్రుఁ గాంచి యాననసామ్యం
బందెను వీఁడనఁ బీపున
గుందగునటు మృగమదంబు గూర్తురు కనుమా. ౮౩.

చం॥ వెలుగుల ఱేనికిన్వెఱచి వేగమ డాఁగెఁ దమంబు గేహమం
-చొౕగి మణిదీపముల్ కనలి యుజ్జ్వలదీప్తిని దానిఁదోల నె
వ్వగ నది నిల్వ చోటెచటవాటిలఁ గానక జాలకాళిలో
నగురుబెడంగు ధూమమను నాకృతి వెల్వడిపోవుఁ జూచితే ౮౪

కం॥ నెలఱా ల్నెలవులు వెన్నెల
చలువన్ హిమబిందువులను జాఱఁగవదలన్
జలధారా గృహముల బలె
వెలయుచు గేహములు తమిని వినుతికి నెక్కెన్. ౮౫

చం॥ అలుక వహించి కేళిగృహ మందున భర్తలుడాఁగి నిల్వ గో
డలు మణిరాజితంబు లగుటన్ బ్రతిబింబములెచ్చి యెల్లెడన్
వెలయ, విలాసినుల్వెదకి వేసరి భిత్తికలంటి నాథులన్
దెలిసిరి స్పర్శసౌఖ్యమునఁ దెచ్చిరిశయ్యకు వేడ్కమీఱఁగన్ ౮౬

కం॥ అనిలుఁడను దొంగ క్రీడా
వనమందున డాఁగి తమి గవాక్ష పథమునన్
జనుచును రతాంత తాంతల
తనువులఁగల స్వేదబిందుతారలఁ గొనియెన్ ౮౭

కం॥ కేతుదుకూలోపమజీ
మూతము హరిమణుల కాంతి ముసుగిడఁ గేకి
వ్రాతము తొలికాఱ్మొబ్బని
యాతత నాట్యంబులాడె హర్మ్యాగ్రములన్ ౮౮

కం॥ సతతం బుదారశోభో
న్నతమగు పురిఁగాంచి ధర్మనందనుఁడందెన్
మితిలేని ముదము తృష్టయు
క్షితిపతి సత్కృతులనంది చెందెనుతృప్తిన్. ౮౯

తే॥గీ॥ పాండవేయుల యనుమతిఁ బడసి శౌరి
నిజపురంబునకుం జన నిరతకలహ
భోజనుండంత మహతీ విరాజుఁడగుచు
వచ్చి సత్కృతులందుచుఁ బలికె నిటుల. ౯౦.

చం॥ హితమొకటేను దెల్పెద నహీన మతిన్వినుఁడీరు ద్రౌపదీ
సతిచెలువంబు లక్ష్మికిని సాటియనన్ దగు నామె రూపు పే
ర్యతిశయ భ్రాతృవత్సలత నంతఁగలంపక యుండఁజూడుఁడే
క్షితి మగవారి పోరులకు చెల్వలు మూలములెందుఁ జూచినన్ ౯౧.

తే॥గీ॥ సురలచేత నవధ్యతా వరమునంది
సోదరులు మున్ను సుందోపసుందులనెడి
వారు సురవారవనితను గోరిపోరి
శమనుపురిఁ జేరి రన్యోన్య శస్త్రనిహతి. ౯౨.

సీ॥ అనుమాని పలుకులు విని పాండవేయులు
వారిరి యొకొక్క వత్సరంబు
చెలియనొక్కఁడు చెందవలెనను సంకేత
మొనరించి యత్తఱి నొండొకండు
నేకతమున నైన నేకశయ్యను నుండు
వారినిఁ గాంచిన దూరదేశ
సంచార మొనరింపఁజన వలె నొకహాయ
నమ్మని సమయ నిర్ణయముఁ జేసి.

తే॥గీ॥ అగ్ని సాక్షిగ ముని ప్రమోల నందఱేక
కాలమునఁ బ్రతినఁ జేసిరి కాంత కృష్ణ
యేకభావంబు నందఱియెడలఁ గాంచె
భృంగి యా యాజుతుజపుష్ప సంగతిబలె. ౯౩.

మ॥కో॥ గోధనంబును దస్కరావళి కొల్లగొట్టెనె? యక్కటా!
యీ ధరిత్రిని క్షత్రియాన్వయ మెల్ల సీరయి పోయెనే?
భూధవాహ్వయ సారమెల్లను, పూజ్యమై లయమొందెనే?
యీ ధరాసురు బాధలేరును, నీఁగజేయఁగ నోపరే? ౯౪.

తరళ॥ అనుచు భూధవు ద్వారమందున నంగలార్చెడి విప్రునిన్
గనుచు నర్జునుఁడాడె బ్రాహ్మణ! కాంచుమా యిదె వచ్చె గో
ధనమటంచును శస్త్రగేహము దారిఁబోవుచు ధర్మజున్
వనితనున్ గనె నేకశయ్యను, వాసిఁగాంచిన వారినిన్. ౯౫.

కోకిలకాకవృ॥ ప్రతినకు భంగమయ్యెనని భావము బాధిలఁ బ్ర
స్తుత కరణీయ కర్మమునుఁ జూచి శరంబులఁ గొం
చతిశయభక్తి సోదరున కంజలిఁజేసి వెసన్.
క్షితిసురు గోధనంబునిడి కీర్తిధనంబుఁ గొనెన్. ౯౬.

సవీన. పురముజేరుచుఁ బ్రతిన నెరపన్ బూని యర్జునుఁడల్ల సో
దరునిఁజేరుచు నడిగికొని యెన్ ధర్మసూక్ష్మమెఱింగి భూ
వరుఁడు సమ్మతి నిడియెఁదుదకున్ వ్యాకులాయత చిత్తుఁడై,
నరుఁడు తీర్థము లరయఁజనె నానందమంది యుదీచికిన్. ౯౭.

అంబురుహవృ. దేవతలమ్మునఁ బుట్టినమాత్రన, దేవతల్గని రవ్యయం
బీ వసుధాతలమందు జనింపఁగ, నీఁగిరెల్లరు పాపముల్
భావజవైరి జటాతల మంచునఁ, బావనంబని నిల్చె నే
దేవి, భగీరథుపుణ్య ఫలంబు సుధీ జనౌఘునిధానమై. ౯౮.

ఉత్సాహ. భూసురాళి సహితుఁడగుచు, భూరిమోద మందుచున్
వాసవాత్మజుండు దివ్య వాహిని స్మనుంగ నా
వాసుకీంద్రు సుత యులూచి వలఁచి వాసిఁగొని నిజా
వాసమునను జేర్చి వేఁడె వాసిఁగాంచు సుఖములన్ ౯౯.

మానిని. శ్రీకరు నన్వయశేఖరుఁ గోరెడి చేడియ మారనిపీడితయై
యాకరణి న్దను వేడఁగ నర్జునుఁ డాభుజగేంద్రుని భోగశుచిన్
జేకొను తల్పముఁ జేరుచు గూడెను చెల్వను శౌరి రమన్బలె, నా
కోకిలవాణి కొమారుని విక్రమ కోవిదుఁ గాంచె నిలావతునిన్. ౧౦౦

మాలిని. తనయునిఁ గనిలోసన్ దండ్రి సంతోషవార్ధిన్
మునిఁగియు నటనిల్వన్ బోలదంచు న్మనంబం
దునఁ దలఁచి యులూచిన్ జూచి యూరార్చి తీర
మ్మునకుఁ జనియె వేగన్ మోదమందన్ బ్రియాళుల్. ౧౦౧

కమలవిలసితవృ. వినిచె సకలమును విజయుఁడు వేడ్కన్
గనియెఁ దుహినగిరిఁ గల విభవంబున్
జనియె మఘవుదిస నగఁగ మహేంద్రం
బనఁజను నగమున కతిశయ ప్రీతిన్. ౧౦౨

వనమంజరి॥ దినములుగొన్ని నరుండఁట నిల్చి మదిన్ముపంబునంది యా
వననిధి తీరమనోహర కైతకి వల్లరిగత పాంసు దు
ర్దినములఁ గాంచన మార్గమునంజని తీర్థరాజము సేతు వే
ఘునదిశ వాసినిఁ గాంచె నిరంతర కాంతి నద్దిశఁ బోవుచున్ ౧౦౩

కం॥ నవనాగలతల పెనకువ
చవిఁ గాంచెడి క్రముకభూజ జాలారణ్యం
బవలీల దాటి పాండ్యుని
యవనిన్ మణులూరు నగరు నర్జునుఁ డందెన్. ౧౦౪

కం॥ అంగజ సము నర్జునుఁ జి
త్రాంగదయను మలయకేతు తనయ వరింపన్
రంగుగఁ బరిణయమయ్యెన
భంగురగతి నామెభోగభాగ్యము నందెన్. ౧౦౫

కం॥ నవముక్తాభతటినో్య
ద్భవశీకర సేచితంబు పవనంబని సం
స్తవమొనరిచి హరిచందన
భవనంబగు మలయగిరిని భామినిఁగలసెన్. ౧౦౬.

తే॥గీ॥ ఉభయభాగోర్మి కుంజరయూథమునకు
నర్గళంబని వర్ణింప నర్హమైన
సేతువును లవణవారిధి నీతిపరుఁడు
నర్జునుఁడు జూచి రఘురాము నభినుతించె. ౧౦౭.

తే॥గీ॥ మామఁగనవచ్చి క్రీడి యా మందిరమున
దార నాపన్న సత్త్వను దాఁజిగిల్లి
విరహిణింబలె దేహంబు వెల్లవాఱు
దాని మితభూషణనుఁ జూచి తనరె నపుడు. ౧౦౮.

చం॥ వనరుహనేత్ర యొక్క శుభవాసరమందునఁ గాంచె బభ్రువా
హనుఁడనిఖ్యాతిఁ గాంచెడి మహాబలశాలిని శోభనాంగునిన్.
తనయునిఁ గీర్తికాముఁగని తల్లి విరాజిలెఁ, దామ్రపర్ణి శో
భనమణి కాంతిచే, మలయపర్వత మావలిగాడ్పుచే బలెన్. ౧౦౯.

కం॥ మనమున నర్జునుసమ్మతిఁ
గొని పాండ్యుఁడు సుతునిఁగాఁగఁ గులపదమునకున్
ఘనునొనరిచి చిరకాలము
మనమేర్చెడి చింత నీఁగె మహితయశుండై. ౧౧౦.

ఆ॥ తీర్థరాజమనఁగ దీపించుగోకర్ణ
మర్జునుండు చూచి నట గిరీశు
భక్తిఁగొలిచి యాప్రభాస తీర్థము జేరి
తానమాడి యచటఁదాను నిలిచి. ౧౧౧.

కరిబృంహిత. వాసవజుఁడపు డాశ్రితుల నట వాటిలఁగ నిలుఁడంచుఁ ద్వా
భాసురముగ సుభద్రఁగనుఁగొన భావజుఁడు పురిఁగొల్పఁగా
వేసరిలక యగాళిఁ జఁగను వేడబమును దలంచి స
న్యాసియగుచు విరాళిఁగనుచు సదాకులతఁగనె నెత్తటిన్ ౧౧౨.

కమలవిలసిత॥ తలఁచిన పనులను దగ సలుపంగా
నలవియె జనులకు హరివలదన్నన్
తలఁచెద నరహరి దయఁగలఁడేనిన్
నిలుచును నన్నఁగన నిజమిది ధాత్రిన్. ౧౧౩.

కం॥ మన మణుమాత్రము నిలువఁగఁ
జనదని నరుమనమునుండి చక్రి వెడలెనో
యనఁగను దలఁచినమాత్రం
బున నిలిచెను గరుణ నరుని మ్రోల హితుండై. ౧౧౪.

ఆ॥వె॥ నరుని మనముఁదెలిసి నారాయణుఁడు చిఱు
నగువునగుచు సేమమగునటంచు
రథము నెక్కు మనుచు రాత్రి రైవతగిరిఁ
జేర్చి నగరుదాను జేరె వేగ. ౧౧౫.

కం॥ మురహరు ననుమతి రైవత
గిరిలో నుత్సవము సేయఁ గృతనిశ్చయులై
పురజనులు పోయి యచ్చట
సురతరనర సలుసలుపుచుండిరి వేడ్కన్. ౧౧౬.

చం॥ హరి తనుఁగూర్చి ముచ్చటలు నాడుచునుండెడు వేళ నర్జునుం
డరయఁగ రామణీయక సుధాంబుధిఁ బుట్టిన లక్ష్మియోయనన్
బరగెడి కన్యకామణిని భద్రగుణాన్వితను సుభద్రనున్
స్ఫురదరవిందలోచనను సుందరినిన్ గనువిందుగన్ గనెన్ ౧౧౭

చం॥ చంచల చంచలాభ నవచారు శరీరముఁ జూచినంత రో
మాంచ నిరంతరాంగుఁడయి యర్జునుఁ డొప్పెను శైలసానుమే
ఘాంచిత లేఖఁ గాంచి కుసుమాళి వహించిన నీపరాజి రూ
పించుచు పంచబాణశరభిన్న హృదంబుజుఁడౌచు నత్తరిన్. ౧౧౮

క॥ అనురాగ మాకృతినిఁ గొని
తనువునుఁ గప్పెనొ యనంగఁ దన కాషాయం
బును గప్పికొనుచుఁ జెలిపై
గనులుంచిన నరుని శౌరి కని యిట్లనియెన్. ౧౧౯

కం॥ అనిశము నే రూపంబును
గనులన్ మనమునను దనరు కానఁగ ధ్యానం
బొనరించుచుందు రా రూ
పును దనియఁగఁ గందురిందుఁ బొందుగ ననియెన్. ౧౨౦

కం॥ హలితప్ప నన్యయాదవ
కులమెల్లన్ మోదమందఁగుల సతిగా నీ
చెలినిన్ క్షత్రియధర్మము
ననుగొనుట హితమ్మటంచు నరహరి పలికెన్. ౧౨౧

కం॥ సదయత హరియటు పలుకుచు
యదువీరసుతాను యుక్తుఁడయి పురికేగన్
సుదతీ వియోగపీడిత
హృదయుఁడయి క్రీడి పీడ నితరతలంపుల్. ౧౨౨

చ॥ ధరణిని దానవహ్నిబలదర్పము శాంతముఁ జేయనోపు భీ
కరనవప్రావృడంబుద నికాయవిముక్త ఘనాంబుధార లా
నరుని వియోగతాపము క్షణంబును శాంతము సేయనోప కా
శరధిమునింగె క్రీడను. వశంబె మనోభవ తాపమార్పఁగన్? ౧౨౩

క॥ మదనాయుత మర్దితుఁడై
కదంబవాతమును గ్రమకందళతలముల్
మదరక్తమయూరోదిత
నదము లసహ్యముగఁజూచె నరుఁడురుపీడన్. ౧౨౪.

ఉ॥ చందురు మోమునుండి స్మితచంద్రిక లెల్లెడఁబర్వఁజేసి తె
ల్లందనముల్ వెలార్చుచెలి లక్షణమేమని తెల్పవచ్చు సం
క్రందనసూను చిత్తమునుగాల్చి వియోగమహాంధకారమున్
గొందినిఁ బాఱవైచె. భువిఁగోమల గాత్రులశక్తి యల్పమే? ౧౨౫.

తే॥గీ॥ స్వజనులందఱు నా మునిసార్వభౌముఁ
బూజసల్పెదు తలఁపు నా పూజ్యుఁడైన
హలి హృదంబుజ మందున నిలిపి శౌరి
కృతకమునిఁదెచ్చి నిలిపె నాగృహమునందు. ౧౨౬.

సీ॥ అతిథిపూజలనంది యతనుతాపముఁ జెంది
యాసుభద్రను బొందు నవసరంబు
నెదురుచూచుచుఁ గ్రీడి యలజడిఁ గుందుచు
నాయింతి పరిచర్యలందు తఱిని
"మాధవ మాధవా" యటుల "హరే హరే"
యనుచును సరివారియందు విజయ
లాభము నీకగు లలనామణీ! యని
యాశీర్వదించుచు నతివనిన్ను
గని యేనరుఁడు గాని మనమునఁ గోరఁడే
కలయిక యని నుతిసలుపుచుండ
నతివయు యతిచర్య నతివిస్మయతఁగని
జ్యాకిణ లాంఛన సారమైన
భుజగేంద్ర నిభ భూరిభుజయుగంబును జూచి
శ్రుతపూర్వ శుభగుణాన్వితుఁడితండు

ఆ॥వె॥ సవ్యసాచి యనెడి శంకపడిన్వాని
నిజముఁ దెలియఁ గోరి నీరజాక్షి
పదములొత్తి మృదులపదముల నాయతిఁ
గూర్చి పలికె నిటుల గోప్యగతిని. ౧౨౭.

శా॥ స్వామీ! తీర్థనిషేవణంబునకునై సర్వప్రపంచంబునన్
క్షేమంబారసి కాంచినారనుచు మున్వింటిన్గదా? యెప్పుడేన్
నా మేనత్త కొమారుఁడర్జునుఁడు సన్మాన్యుండు మీదృష్టికిన్
దామిత్రుండయెనే? యెఱింగిన సమస్తంబున్విన న్గోరెదన్. ౧౨౮.

కం॥ ఏభువి యా దివిజేశ త
నూభవు సాన్నిధ్య మహిమ నూతనలక్ష్మీ
వైభవమునఁ దనరారెడి
నాభువిసామాన్యమాత్రము నడిగెదఁ దెలియన్. ౧౨౯.

ఉ॥ భామిని వాక్యసారమును భావము గ్రోలగ సంతసించి యో
సామజయాన! నీపలుకుసత్యము. సర్వముఁ గాంచి యిప్పుడీ
భూమిని నీసమీపమునఁ బొందుగ సంయమివేషమూని యా
కాముని బాణకిన్బగడి కందుచు నుండెడి వానిఁగానవే? ౧౩౦.

కం॥ అను కృత్రిమముని పలుకులు
విని మానిని నాసహైన వ్రేలిడి నిలువన్
గని నరుఁడా సతి సందియ
మును మాన్పఁదలంచి పలికె ముదమున నిటులన్. ౧౩౧.

కం॥ యువతీ నే నర్జునుఁడను
భవితవ్యత మెఱుంగుదీవు పలుకఁగవలెనా?
భువి నెల్ల గెలిచి నేనొక
పువువిలుకానికిని జిక్కి పోడిమి చెడితిన్. ౧౩౨.

కం॥ వనితామణి యామాటలు
వినినంతనవచ్చి కలసె క్రీడయనెడి నా
తనసఖి యెచ్చటనుండియొ
చనె నాచెలిఁగూడి యపుడె చాన బిరానన్. ౧౩౩.

కం॥ చెల్లెలకును గుశలంబును
దల్లికిఁ దండ్రికిని నొప్పఁదగినదియును నై
చెల్లందగు కార్యంబును
నల్లన హరిసలుపఁదలఁచె హలియెఱుఁగనటుల్. ౧౩౪.

కం॥ గిరిశోత్సవ దర్శనమిష
పురజనులును హలియుబంధువులు తనుగూడన్
హరిచనియె నొక్కద్వీపాం
తరపర్వతమునకు నచటఁదడసె నొకింతన్. ౧౩౫.

కం॥ నరుఁడింద్రుఁ దలఁచె శౌరిన్
దరుణీమణితలఁచె నపుడె తదుభయులును వ
చ్చిరి ద్వారక చేరఁగ నా
హరి పరిణయ వస్తువులను నమరిచె వేగన్. ౧౩౬.

కం॥ శచివచ్చె వరునియానతి
శుచులౌ మునివరులు వచ్చి శుభలగ్నము గూ
రిచి రా రాత్రిని మేలన
బచరించిరి మంత్రములను భద్రాశయులై. ౧౩౭.

గీ॥ అర్జునునకు భూషలమరేంద్రుఁ డమరిచె
శచి సుభద్రకుఁ గూర్చె సకలవిధము
లైన యాభరణమ్ము లన్నియు నంతట
మునివశిష్ఠుండగ్ని ముందలవారిఁ

గలిపెఁ బా నొకమెయి గాంధర్వ విధిఁబూని
యందఱు శుభమని యాడుచుండ
నప్సరోగణమెల్ల హారతులెత్తఁగ
నాశీర్వదించెను హరియు నంతఁ

తే॥గీ॥ దమితమ పురంబులను గూర్చి తరలిరెల్ల
వారు హరియునుఁ జేరె ద్వీపంబు వేగ
రక్తిమీఱ సుభద్ర సారథ్యమూని
నరుఁడు వేడుక నఱిగె నా నగరునుండి. ౧౩౮.

సీ॥ కన్యాపహారంబుఁ గావించి నిశిఁబురి
వెడలెడు వానిని నడరి దాఁకు
పురరక్షకుల నెల్లఁ బరిమార్చి నరుఁడంత
హతశేషులందఱు హలికిఁ దెలుప
రోషమంతయు నొక్క రూపమైనట్టులఁ
గాషాయితాత్ముఁడై కడలిబలెను
వెడలు సేననుగూడి కడకమై నరునిపైఁ
గడువేగమునఁ బోవు కార్యమెఱిఁగి

తే॥గీ॥ హరి నివారించెఁ గాదని హలిని, నంత
నరుఁడు చేరెను ధర్మజుపురిని వేడ్క
పౌరులెల్లరు సంతోష పరులు నగుచు
వారిఁ జూచిరి నేత్రోత్సవంబుగాను. ౧౩౯.

కం॥ బలరాముఁడు హరియునుఁ జె
ల్లెలిని గనవచ్చి యా నిలింపసుతునిచే
సలుపంబడు పూజలఁగొని
హలి మరలెను ధర్మసూను ననుమతిఁ బురికిన్. ౧౪౦.

కం॥ సుభటాభి నందనీయుని
నభిమన్యు సుభద్రకాంచె నన్వయకరునిన్
శుభవిక్రమ సంపదచే
ప్రభవించిన విజయమటులఁ, బార్థునివలనన్. ౧౪౧.

ఉ॥ కాంచిరి ముజ్జగంబులకుఁ గాంతినొసంగెడు బంచపాండవుల్
పంచశిలీముఖుం డెపుడు పట్టెడు పంచశిలీముఖంబులో
యంచన నొప్పునట్టి విమలాంగులఁ బుత్రులఁ గృష్ణచేతఁ, బ్రా
పంచికమంది యైంద్రియికవర్గము వైషయికాళిఁ గాంచెనా! ౧౪౨.

తే॥గీ॥ సంధిముఖ కర్మషట్కంబు సంగ్రహించి
పరసుసాధనకర్మలఁ బండితులగు
వారటంచని బాలుర వాసవియును
వాసవుండును గాంచిరి వాసిగాను. ౧౪౩.

చం॥ ననవిలుకాని వైభవము నంతయుఁ బ్రాభవమొప్పఁ జేయుచున్
వనరెడి జీవరాశికిని వాసియొనర్చి కులప్రవర్గమం
దునఁ బ్రథమంబునై వెలసెనో యభిమన్యు భవంబునాఁడిక యం
చనఁదగు నావసంతబుతు వాసమయంబునఁ దోఁచె ధారణిన్. ౧౪౪.

తే॥గీ॥ పరుషమగు నాతపంబునఁ బరితపించు
చుండు నిజరథవాజులఁ జూచి సూర్యుఁ
డశ్వముల తాపసాంత్వికినై హిమాల
యంబునకుఁ బోయెనన నుత్తరాశఁజరె. ౧౪౫.

కం॥ అరుణుఁడను భిల్లుఁ డురుతర
కరభల్లములూని పొడువఁ గలఁగి చలువకున్
హరిణమ్ములు ధారావం
దిరములలో డాఁగు గ్రీష్మ దినములు వొడమెన్. ౧౪౬.

మ॥ ధర గ్రీష్మర్తు దినాభివృద్ధిఁగన నింద్రప్రస్థ మొప్పెన్ నిరం
తరధారాగృహ వారిసిక్తమగు రథ్యంబై సదానర్తనం
బరుదారన్గను వీజనాళికలదై హారావళీముక్తకం
ధరశోభాకర కామినీనికరమై దాకేపణత్యక్తమై. ౧౪౭.

ఉ॥ చారుతరంబుగా సరససచందనపంకవిచర్చితంబులై
సారమృణాళహారములు సారెకుఁబై పయిఁగప్ప శీతలా
ధారములైన పద్మదలదండ వసించె వియోగఖిన్నుఁడై
మారుఁడు దర్పహీనతను మాధవచిహ్నయె నా ధరిత్రిలోన్. ౧౪౮.

చ॥ సకియల మోముచందురుల జాఱెడి స్వేదలవంబు లెక్కుఁడై
మకరికలన్ జెడంగనుచు మానకబాధలుపెట్ట, వీనులన్
వికసిలు పాటలంబులను వెల్వడి బంభరజాల మా పత
త్రక నవవీజనంబులను రాజిల వీచుచు నార్చె స్వేదమున్ ౧౪౯.

మ॥ మృదుమార్ద్వీక రసాదరుల్ యువులు మేన్మేలంచు నత్యాశతో
మదిరాపానసువాసితాననల నమ్మ న్వద్దకుంబిల్చి యా
మదిరాక్షీజనతాధరస్థ రుచిరమ్యంబైన పానీయమున్
మదికిన్ మోదమెలర్పఁ గ్రోలిరి సుధామాధుర్యమం చత్తఱిన్ ౧౫౦.

తే॥గీ॥ దినవిరామంబు దాకను దీర్ఘికలను
మధురమజ్జనకేళిని మగలఁ గూడి
నిమ్ననాభులు నిలువఁగ నీరుద్రావి
జనెనో నాభులనన్ లోఁతు చనియె జలము. ౧౫౧.

కం॥ ఎండకు నరహరు లోపక
యండజయానలనుగూడి యరిగిరి వేగన్
దండను హిమగర్భజలం
బుండెడి యమునకును నుచిత పరివారముతోన్. ౧౫౨.

సీ॥ సఖులతో నచ్చట సుఖులుగా వారుండ
జాతవేదుండు ద్విజజాతివేష
మూనుచు స్వశిఖోపమానమై భాసిల్లు
వీక్షణములును, నవీనముగ్ధ
మాహుతులను గొని యందెనా విమలత
నన నుపవీతములను ధరించి
నవహావిరామోదమవుచును దపనీయ
కమలావమానంబు గలుగఁజేయు
ముఖమొప్పఁగను ధూమముఖ వసనంబుతో
వచ్చె నచ్చటికిని వనిత లెల్ల
జడిమ నతని కడారి తేజము పిశంగ
దృష్టియునుఁజూచి మూరము తెరలిరంత
నరహరులు భక్తి నతనికి నతులొనర్ప
ద్విజుఁడు హర్షించి వారిదీవించి పలికె.

కం॥ క్షుధితుఁడను భోజ్య మిండని
వదనము దీనతనుదోఁప వచియించిన యా
ముదసలికి నన్నమిడ నా
యదుపతియుఁ గ్రీడి యొప్పి రంత ద్విజుండున్ ౧౪౩

సీ॥ మహనీయులార నే దహనుఁడ ద్విజవేష
మూనివచ్చినవాఁడ నుదరమునకు
మీరిచ్చు నశనంబు మితిమీఱ భుజియించి
యందెదఁ దృప్తిని ననుచుఁబలికి
ఖాండవ మురుతరుషండ భీకరసత్త్వ
మండితంబగుచు నీదండనుండు
నిరపాయమని నిశాచరసర్వగణమందు
నివసించుఁ దక్షకనిలయ మచట

తే॥గీ॥ నున్నకారణమునఁ బురహూతుచేత
రక్షితంబయి వెలయు నరణ్యమద్ది
దానిభక్షింపఁబోయిన తఱి ఓడౌజుఁ
డతులఘున మిష నన్నుఁ దా నావరించు. ౧౫౪.

కం॥ కావున మీ సాయము నా
కావహిలన్నెను శతసహస్రాత్ములనున్
బోవం దోలుచు నాపనిఁ
గావించెద ననుచు నగ్నికడక న్బలికెన్. ౧౫౫.

చం॥ యదుపతిబోధచే దహనుఁడక్షయ బాణనిషంగ మాజిస
మ్మదమునునిచ్చు గాండివ మమోఘశతాంగము శ్వేతవాహముల్
త్రిదశవరేణ్యసూనునకు దివ్యములివ్వి యటంచు నివ్వఁగా
ముదినిఁ బ్రమోద మంది కొనె మానితసత్త్వుఁడు వాని నత్తఱిన్. ౧౫౬.

ఉ॥ పాండవపాణిసంఘటితబాణతటిత్సముదాయ భీష్మమై
గాండివ మేఘసంజనిత గర్జనమెల్లెడ పిచ్ఛలించుచున్
ఖాండవ మాక్రమింప నది కాంచి మహాప్రళయాంతకారిగా
నుండెడి గండమంచు భయమొందెను సత్త్వములెల్ల నచ్చటన్ ౧౫౭.

తే॥గీ॥ అట్టి సాహాయ్యతను గని యాశ్రయాశుఁ
డధిక భీకరమైన నిజాకృతిఁగొని
కాననంబెల్ల వ్యాపించి కాల్చఁదొడఁగె
ఫలము సుసహాయమూలమై వెలయుఁగాదె. ౧౫౮.

తే॥గీ॥ లలిత కలవింకజాలసీలంబు నగుచు
రహి కపోతకయూథ ధూమ్రంబు నగుచు
పక్షినివహంబు ధూమంబు భంగి నెగిరె
ననలుఁ డడవినిఁ గాల్చెడు నవసరమున. ౧౫౯.

కం॥ అనలుని దాడికి వెఱచుచు
వినకాననలక్ష్మి చెన్నుచెడి యూర్ధ్వగతిన్
జనుతఱినిఁ గ రి చెదరుచు
గనఁబడునన ధూమమొప్పె ఘనమార్గమునన్. ౧౬౦.

చ॥ పటుతరనూ నికుంజములఁ బాయక సూర్యునిరశ్మి సోఁకకా
యటవిని నున్న యున్నత గజాళివరాహసమూహముల్ తమః
పటలము లాగువెల్వడెను బావకుఁడుజ్వలుఁడై యరణ్యమ
క్కటికమునూని యుగ్రముగఁగాల్చెడి కాలమునం దుదగ్రమై. ౧౬౨.

తే॥గీ॥ విపిన విటపాగ్రములనెక్కి విపులపవన
చలిత కీలాకలాపముల్ వెలయఁజేసి
ఫణిశతంబు గ్రసించుచుఁ బర్వతస్థ
శిఖరముల రాజిలెనుగదా శిఖివిభవము. ౧౬౩.

చం॥ చమరకులంబు వ్యాకులతఁ జయ్యనఁబాఱుచు వెన్క వాలభా
రముగన మానసంబున దురంతవిచారకృశాను వేర్పఁగా
శ్రమపడుచుండె నట్టితఱి జ్వాలలు దేహమునంటిరాగ ద
గ్ధమునగు చర్మము న్వడిగఁ గంతముఁద్రిప్పుచు నాకె నెవ్వగన్. ౧౬౪.

మ॥ ప్రకటస్ఫోటరవాట్టహాసముల ఘోరంబైన జ్వాళావళుల్
సకలాకాశతలంబుఁ జుట్టికొనిగా సంతోషమున్ జెంది పా
వకుఁడీర్ష్యన్ శతమన్యుపట్టణము నేర్పంగన్ విజృంభించి వ్యా
పకుఁడయ్యెన్ గడునిక్క భూరితరగర్వ స్ఫూర్తిచేఁ జొక్కుచున్ ౧౬౫

సీ॥ బలరిపు ననుజాత్మజులచే నలాతముల్
రీతిని గిరగిరఁద్రిప్పఁ బడుచు
వేగమ పాఱెడి విపినసత్త్వములందుఁ
గనిమె నామిష మాశుగంబులెందు.

నరశరతతి నర్ధశిరవిహీనోరగ
ఫణగతమణిగణ ప్రభలు వెలసె
విస్ఫులింగములటు వినువీధి నంతట
దహను బాతికిఁదప్పి తరలఁ జూచు

యాతుధానులు హరిచక్రహతులు నగుచు
నర్జునాశుగతతికి నాహార మగుచు
ధరణిఁ బడ వారి నెల్లర దగ్ధులుగను
జేసె వైశ్వానరుండతి శీఘ్రముగను. ౧౬౬.

ఉ॥ తత్సుకరక్షణమ్మును హితమ్ము మదిన్ బెరరేప నాసహ
స్రాక్షుఁడు రోషమాకృతిని నందినరీతిని నత్యుదగ్రరూ
క్షేక్షణుఁడై ఘనమ్ముల ననేకములన్ గుమిఁగూర్చి సేన క
ద్యక్షుఁడు తానయై నడచె నభ్ర పథంబున వేడ్కమీఱఁగన్ ౧౬౭.

తే॥గీ॥ కనఁదటిన్మయతర్జనీకాంతి వెలయ
జగములెల్లను గలఁచు గర్జనలు మీఱ
దావదహనుని మాడ్కిని దర్జనముల
నాకసముఁజేరె నా బలాహకుఁడు వడిని. ౧౬౮.

తే॥ అనలమునఁబుట్టు మిడుగురు లంతరాళ
మునను ధూమముతోఁగూడి మునరికొనఁగ
స్తనితముల మించుదీగెల వనదరూప
నిశ్చయజ్ఞాన మలవడె నిర్జరులకు. ౧౬౯.

కం॥ అనలునిపైఁ గనఁబడు నా
వనధారల దైర్ఘ్య మమరవారణ హస్తం
బును మించి భువనమంటప
మున స్ఫటికస్తంభమనెడి బుద్ధినిఁగఱపెన్. ౧౭౦.

ఆ॥వె॥ జలపధారవలన జ్వలనుఁడు చిక్కిన
రోషపావకమున రోఁజుచుండు
నరుఁడు బాణకోటి నురుదృఢముగ వియ
న్మార్గ మెల్లఁగప్పి మహితుఁడయ్యె. ౧౭౧.

సీ॥ శుచికి వితానత శోభిల్లు శరకూట
తల జలదాసారజలము లెగిరి
దిగఁబడ జాఱుచుఁబొగచూరి యాలయ
చిత్రభిత్తికలయి చెలువు మీఱె
నత్తఱిఁ దక్షకు మత్తకాసిని తన
తనయునితోఁగూడి దహను దాడి
తప్పించికొని పోవుదారిని నరశర
మున గతశిరయయి వనరుచుండఁ

తే॥గీ॥ పాకశాసనుఁ డుల్బణవర్షధార
నిజసుతు మనంబుఁగలఁచి యానెయ్యుతనయు
నశ్వసేనుని మాతృపృచ్ఛాగ్రయుతుని
గాచి కీర్తిధనంబును గాంచె నపుడు. ౧౭౨.

తే॥గీ॥ శీర్షమాత్రము శేషించి ఛిన్నదేహుఁ
డశ్వసేనుఁడు శరణని యర్యమాత్మ
జుని సరసఁజేరె. సురపతి వనవినాశ
మునకు సుహృదుని వనితచావునకుఁగసలి ౧౭౩

కం॥ కుపితుఁడయి కులశముంగొని
సువర్వపతి యనికి వెడలఁ జూచి వెస[illegible]
క్షతులతనిఁ గలయ యాదవ
పతినిఁ ఫల్గునుని దాఁకె ప్రతికృతిరతుఁడై. ౧౭౪.